బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో...

# బ్రహ్మజ్ఞానం



రచన & ప్రచురణ : తటవర్తి వీరరాఘవరావు

2021 సం॥రం : రెండు ముద్రణలు

ప్రతులు : 4,000

వెల : రూ. 60/-

పుస్తకముల కొరకు

తటవర్తి వీర రాఘవరావు

తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.

సెల్ : 9490171853, 9440309812

email : balajipyramid.bvrm@gmail.com

# బ్రహ్మజ్ఞానం

ఈ బ్రహ్మజ్ఞానం తెలుసుకోవడానికి ఆసక్తి చూపించే వారు ఎంతోమంది వున్నారు. తమ జీవితాలనే అంకితం చేసిన వారున్నారు. ఎన్నో పాట్లు పడినవారు కూడా ఎంతోమంది వున్నారు.

బ్రహ్మజ్ఞానం పొందాలనే తపనతో, దాన్ని తెలిపే, బోధించే గురువుల కోసం హిమాలయాలకు వెళ్ళిన వారున్నారు. అరణ్యాలకు, ఏకాంత ప్రదేశాలకు, ఆశ్రమాలకు, గురుకులాలకు వెళ్ళినవారున్నారు. ఆధ్యాత్మిక గురువులను, పీఠాధిపతులను, యోగులను, పెద్దలను ఆశ్రయించిన వారున్నారు.

చాలా మంది ఈ బ్రహ్మజ్ఞానం కోసం ఇంటిని, సంసారాన్ని, ధనాన్ని,సకల భోగాల్ని, సరదాలను, సమస్తాన్నీ వదలుకుని ఆ గురువులను ఆశ్రయించి, వారి ద్వారా ఈ బ్రహ్మజ్ఞానం పొందాలని తపన పడేవారు. ఆ గురువులకు ఎన్నో సంవత్సరాలు సేవ చేసి, వారి పరీక్షలు తట్టుకుని, ఎన్ని కష్టాలైనా భరిస్తూ, ఈ బ్రహ్మజ్ఞానం పొందడం కోసం ఆరాటపడేవారు.

అలా వచ్చిన వారిని, కొంతమంది గురువులు పూర్తిగా తమ సేవకు ఉపయోగించుకునే వారు. అలా జీవితమంతా జీతం లేకుండా సేవ చేయించు కోవడమే కాకుండా ఆశ్రమంలో అన్ని పనులు చేయించేవారు.

ఇంకా కొంతమంది గురువులు ఈ జ్ఞానం తమకు తెలియకపోయినా! తెలిసినట్టుగా నటించి, ఏదో తమకు తెలిసిన దాంట్లో కొద్దిగా చెపుతూ ఆ శిష్యులను బాగా ఉపయోగించుకొనేవారు. ఇంకా కొంతమంది గురువులు బ్రహ్మజ్ఞానం తెలియకపోయినా వచ్చిన శిష్యునికి ముందు నువ్వు అర్హత సంపాదించుకోవాలి, అర్హత లేని వారికి బ్రహ్మజ్ఞానం లభించదని చెప్పేవారు.

ఇంకా కొంతమంది గురువులు బ్రహ్మజ్ఞానం అందరికీ వెంటనే బోధించకూడదంటూ బ్రహ్మజ్ఞానం తెలిసినా, వారికి ఎన్నో సంవత్సరాలు ఎన్నో ఇతర విషయాలు చెప్పేవారు, సాధనలు చేయించేవారు. అలా వారి వద్ద

నిలబడలేక ఎంతోమంది వెళ్ళిపోయేవారు. ఒకవేళ కొంతమంది నిలబడినా వారికి బ్రహ్మజ్ఞానం అంటే ఏమిటో చెప్పినా సరైన సాధన చెప్పలేకపోయేవారు.

ఇంకా కొంతమంది గురువులు బ్రహ్మజ్ఞానమంటూ రకరకాల బోధలు చేసేవారు. అదే బ్రహ్మజ్ఞానం అనేవారు.

అలా సమాజంలో బ్రహ్మజ్ఞానం పొందలేక ఎంతోమంది రకరకాల స్థాయిలలో, రకరకాల ఇబ్బందులు పడేవారు. అందుచేత బ్రహ్మజ్ఞానం గురించి తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

బ్రహ్మను గురించి తెలుసుకోవడమే **"బ్రహ్మజ్ఞానం".** ఎంత తెలుసుకుంటే అంత జ్ఞానం పొందినట్టు. అలాగే ఈ బ్రహ్మను పొందే మార్గమే అంటే విద్యే **"బ్రహ్మవిద్య"** అంటారు. అలాగే ఈ రెండింటి గురించి ఎవరైనా చెప్పినా అంటే ఉపదేశించినా దానిని **"బ్రహ్మోపదేశం"** అంటారు.

అందుచేత ముందు 'బ్రహ్మ' గురించి తెలుసుకుందాం. ఆ తరువాత 'బ్రహ్మ'ను పొందే విద్య తెలుసుకుందాం.

'బ్రహ్మ' అంటే గొప్పదైన అని అర్థం. అంటే అన్నింటికంటే! అందరికంటే! గొప్పదని అర్థం. దానికి మించింది లేదని అర్థం. అంటే 'బ్రహ్మ' అంత గొప్పవాడని అర్థం.

'బ్రహ్మ' నామ, రూప రహితుడు. అంటే ఆయనకు ఎటువంటి పేర్లు లేవు, రూపము లేదు. ఆయన క్రియా రహితుడు. అంతేకాదు ఆయన సజాతీయ, విజాతీయ, స్వగత భేధరహితమైనవాడు. ఇక్కడ ఒక మనిషికి ఇంకొకనికి గల సంబంధమే సజాతీయము. వారిద్దరికి గల బేధము సజాతీయ బేధము. అలాగే మనిషికి పశువుకు గల సంబంధము విజాతీయము. మనిషికి పశువుకు గల బేధము విజాతీయ బేధము అంటారు. ఒకే శరీరంలో ఒక అవయవానికి మరొక అవయవానికి గల భేదాన్ని స్వగత భేధం అంటారు.

అంతేకాదు బ్రహ్మ సర్వవ్యాపి అంటే అంతటా వ్యాపించి వున్నవాడు. పరిపూర్ణుడు. ఆయన గురించి అట్టిది, ఇట్టిది అని చెప్పలేనట్టివాడు. ఆయనను

పరుడు, పరతత్వము, పరబ్రహ్మము, పరిపూర్ణము, చిత్తు, సత్తు, బ్రహ్మము మొదలైన పేర్లు, మహాత్ములు ఆయన గురించి బోధించడానికి పెట్టినవే కానీ అవి ఆయనకు సంబంధం లేదు.

ఎందుచేతనంటే ఈ అనంతమైన విశ్వంలో అనంతమైన లోకాలు వున్నాయి. ఈ లోకాలలోని జీవులు, జీవరాశులు, అన్నీ ఆయనచే, ఆయన నుంచే సృష్టింపబడ్డాయి. అందుకే ఆయన అందరి కంటే గొప్పవాడు. అంతేకాదు ఆయన నిత్యమైన వాడు అంటే శాశ్వతమైనవాడు అంటే ఎల్లప్పుడూ వుండేవాడు అంటే మార్పు చెందని వాడు అంటే కాలం మారినా, యుగాలు మారినా మారని వాడు. ఈ సృష్టిలో ఇలాంటి లక్షణాలతో వున్నది ఆయన ఒక్కడే.

ఒక రకంగా చెప్పాలంటే ఈ లక్షణాలన్నీ వున్నాయి కాబట్టి ఆయనే 'సత్యం'. ఆయన తప్ప ఇంక ఏదీ 'సత్యం' కాదు. కారణం 'బ్రహ్మ' తప్ప ఇంక



ఏదీ నిత్యము కాదు. అంటే శాశ్వతము కాదు. ఎందుచేతనంటే ఈ ప్రపంచంలో ఏది చూసినా ఏది తీసుకున్నా ఏదీ శాశ్వతం కాదని తెలుస్తుంది. అంటే అన్నీ మారేవే! మార్పు చెందేవే! కారణం ఈ సృష్టిలో ఏదైనా సరే సృష్టింపబడినదే, అంతేకాదు సృష్టింపబడినది ఏదైనా సరే కొంతకాలమే వుంటుంది. అలా వున్నది

కొంతకాలానికి అదృశ్యమైపోతుంది. అందుకే బ్రహ్మ నుండి వేరైనవన్నీ 'అసత్యాలే!'.

ఈ సృష్టిలో ఏదైనా తీసుకోండి! ఆఖరికి 84 లక్షల జీవులు–జీవరాసులు, చరాలు–అచరాలు అన్నీ కూడా మొదట సృష్టింపబడుతూ వుంటాయి. అవి మారుతూ, మార్పు చెందుతూ కొన్నాళ్ళు వుంటాయి, చివరకు అదృశ్యమై పోతాయి. ఆఖరికి ఈ భూమి, చంద్రుడు, సూర్యుడే కాదు. కోటానుకోట్ల గ్రహాలు, విశ్వం అన్నీ కూడా ఎప్పుడో ఒకప్పుడు అంటే కొన్ని కోట్ల సంవత్సరాలకైనా అదృశ్యం కావలసిందే. దానినే సృష్టి అంతము అంటారు.

కానీ ఈ మార్పులు, అంతం అన్నవి బ్రహ్మకు లేవు. ఆయన మార్పు లేని వాడు, మారనివాడు. కాలము మారవచ్చు, యుగాలు మారవచ్చు కానీ 'బ్రహ్మ' మారడు. కారణం ఆయనకు పుట్టుక లేదు. చావు లేదు. ఆయన చావు పుట్టుకలు లేని వాడు. ఆయన ఆది, మధ్యాంతరహితుడు. అంటే ఆయనకు పుట్టడం, పెరగడం అలాగే అంతం కూడా లేదు. కారణం ఆయన ఆదిలోను వున్నాడు. అంటే సృష్టి ఏర్పడక ముందు వున్నాడు, మధ్యలోను వున్నాడు అంటే సృష్టి క్రమం జరుగుతూ వున్నప్పుడు అంటే నడుస్తున్నప్పుడు వున్నాడు అలాగే సృష్టి అంతమైపోయినా వుంటాడు.

కారణం ఈ సృష్టే ఆయన నుంచి ఉద్భవించింది. అలాగే చివరకు ఆయనలోనే విలీనమైపోతుంది. అందుచేత ఆయన తప్ప మరొకరు లేరనే చెప్పుకోవాలి. ఈ 'బ్రహ్మ'నే 'ఆత్మ' అని కూడా అంటారు. ఈ విషయమే అధర్వణ వేదంలో కూడా చెప్పబడింది.

**"అయమాత్మా బ్రహ్మ"**

అంటే ఈ 'ఆత్మ' ఏదైతే వుందో అదే బ్రహ్మము.

ఈ 'బ్రహ్మ'నే .. 'పరబ్రహ్మ' అని కూడా అంటారు. కారణం పరము అంటే కనబడనిది. 'బ్రహ్మ' అంటే గొప్పవాడు 'పరబ్రహ్మం' అంటే కనపడని గొప్పవాడని అర్థం.

ఈ విషయమే భగవద్గీతలో శ్రీ కృష్ణ భగవానుడు కూడా చెప్పడం జరిగింది.

**శ్లో॥ అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః**
**అహమాదిశ్చమధ్యం చ భూతానామన్త ఏవచ॥** (భ.గీ.10-20)

అంటే నేను ఆత్మను, నేను సమస్త భూతాలు అంటే సమస్త జీవరాసులలోనూ వున్నాను. నేను ఆదిలోను అంటే ఈ సృష్టికి ముందు వున్నాను. మధ్యలోను అంటే సృష్టి నడుస్తూన్నప్పుడూ వున్నాను. అలాగే అంతంలో అంటే ఈ సృష్టి అంతమై పోయినా నేను వుంటాను.

అంతేకాదు 'పరబ్రహ్మ' గురించి భగవద్గీతలో ఈ విధంగా చెప్పబడింది.

**శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతో క్షిశిరోముఖమ్ !**
**సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి !!(భ.గీ.13-14)**

ఆ బ్రహ్మము అంటే ఆత్మకు అంతటను చేతులు, కాళ్ళుగలవు. అంతటను కన్నులు, తలలు, ముఖములు గలవు. అంతటను చెవులు కలిగి సర్వలోకములు ఆవరించి వున్నది.

దీని అర్థం పరబ్రహ్మకు సర్వలోకముల యందలి సర్వము తెలుసుకోగల శక్తి వున్నదని తెలుసుకోవాలి. అంటే ఆయన సర్వం గమనిస్తున్నాడు. సర్వ జీవులు చేసే పనులు చూస్తున్నాడు. ఆలోచనలు, మాటలు వింటున్నాడు. ఒక రకంగా చెప్పాలంటే ఈ సృష్టిలో ఆయనకు తెలియంది అంటూ ఏమీ లేదని తెలుసుకోవాలి.

అంతేకాదు బ్రహ్మము గురించి భగవద్గీతలో ఇంకా యీ విధంగా చెప్పబడింది.

**శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్**
**అసక్తం సర్వభృచ్ఛైవ నిర్గుణం గుణభోక్తృచ(భ.గీ.13-15)**

**శ్లో॥ బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ**
**సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్(భ.గీ.13-16)**

**శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్**
**భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ (భ.గీ.13-17)**
**శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ (భ.గీ.13-18)**

తా:- ఆ బ్రహ్మము సమస్త ఇంద్రియాలను ప్రకాశింప చేస్తున్నా కూడా దేనిని అంటదు, గుణరహితమైనదై వున్నది.

ప్రాణుల యొక్క వెలుపల, లోపల ఉండునదియు, కదలనిది, కదులునది యును, అతి సూక్ష్మమై వుండుట వలన అజ్ఞానులకు తెలియబడనిదై దూరముగా, జ్ఞానులకు దగ్గరగా కూడా ఉండునది.

బ్రహ్మము విభజింపబడనిదైనను, ప్రాణులందు విభజింపబడిన దాని వలె వుండును. ప్రాణులను సృష్టించునది, పోషించునది, లయింప చేయునదని తెలుసుకొనవలెను.

మరియు బ్రహ్మము సూర్య, చంద్ర, అగ్ని లాంటి పదార్థములకు ప్రకాశమునిచ్చునది. అజ్ఞానము కంటే వేరైనది, జ్ఞాన స్వరూపమైనది. జ్ఞాన గుణములచే పొందదగినది మరియు సమస్త ప్రాణుల యొక్క హృదయము నందు విశేషించి వున్నదని చెప్పబడుచున్నది.

దీనిని బట్టి ఆది అంతములు అంటే పుట్టుక, చావులు అందరికి, అన్నిటికి వున్నాయి కానీ 'బ్రహ్మ'కు లేవు. అందుకే ఆయన అంత గొప్పవాడు. అందుకే ఆయనను 'బ్రహ్మ' అన్నారు. అంతేకాదు ఆయనే 'సత్యం'. ఆయన తప్ప ఏదీ 'సత్యం' కాదు. కారణం ఈ సృష్టిలో ఏదైనా సరే సృష్టింపబడినవే. మార్పు చెందుతున్నవే. అంతం అయిపోతున్నవే! అందుచేత అన్నింటికంటే 'బ్రహ్మ' గొప్పవాడు. అందుకే 'సత్యాన్ని' ఆశ్రయించమని వేదాలలో కూడా చెప్పబడింది. సత్యాన్ని ఆశ్రయించడం వల్ల పొందబోయే ఫలితాలు కూడా ఈ ప్రార్థన ద్వారా తెలియచేయబడింది.

**"అసతోమా సద్గమయ!"**

**"తమసోమా జ్యోతిర్మయ!"**

**"మృత్యోర్మా అమృతంగమయ!"**

"అసతోమా సద్గమయ" అంటే నన్ను "అసత్యం నుండి సత్యం వైపు నడిపించు" అని భగవంతుని అంటే 'బ్రహ్మ'ను ప్రార్థించడం.

కారణం ఇప్పుడు అందరూ 'అసత్యం'లో జీవిస్తున్నారు. 'అసత్యాన్నే' ఆశ్రయిస్తున్నారు. 'అసత్యాన్నే' పలుకుతున్నారు. అలా 'అసత్యంలో' జీవిస్తే నష్టమేమిటి? అని అనుకోవచ్చు. కానీ 'అసత్యంలో' వున్నవారు అపజయం పొందుతారు.

అందుకే "సత్యమేవ జయతే" అన్నారు. అంటే 'సత్యమే' జయిస్తుంది అని అర్థం.

కానీ నాకు జీవితం బాగానే వుంది. సంసారం బాగుంది. ధనం బాగుంది, పెద్దగా సమస్యలు లేవు, ఇబ్బందులు లేవు, ఏది పట్టుకున్నా కలిసి వస్తుంది, అన్ని రకాలుగా లాభం పొందుతున్నాను. ఇదంతా జయమే కదా? నేను సత్యంలో వుంటే ఏమిటి? అసత్యంలో వుంటే ఏమిటి? అని అనుకోవచ్చు.

కానీ జీవితంలో ఎవరికైనా ఈ ఒక్క జన్మే కాదు, ప్రతీ ఒక్కరూ ఎన్నో జన్మలు తీసుకుంటూ వుంటారు. ఒక్కొక్క జన్మలో అంతకు ముందు చేసిన కర్మలను బట్టి జీవితం బాగానే వుండచ్చు. కానీ మరొక జన్మ చాలా దుర్భరంగా వుంటుంది. 'అసత్యం'లో జీవించేవారు 'సత్యం' తెలియక ఎన్నో చేయకూడని పనులు, తప్పులు, పాపాలు చేస్తూ వుంటారు. వాటి పర్యవసానం ఒక్కో జన్మలో చాలా కష్టాలు అనుభవించవలసి వుంటుంది. అపుడు ఎందుకు ఈ జీవితం? అనిపిస్తుంది. ఈ జీవితంలోంచి ఎలా బయటపడాలి? అనిపిస్తుంది. ఇలాంటి జీవితం నాకు వద్దు అనిపిస్తుంది.

అలా మరల, మరల జన్మించడాన్నే "పితృయానం' అంటారు. అసత్యంలో జీవించేవారు "పితృయానం" చేయవలసిందే. "పితృయానం" అంతా అపజయమే.

ఇదంతా సత్యం తెలియకపోవడం వల్ల, సత్యాన్ని ఆశ్రయించకపోవడం వల్ల జరిగింది. అలాంటి సమస్యలు, బాధలు, కష్టాలు, దుఃఖం లాంటి జీవితం అపజయమే కదా? మరి అలాంటి అపజయం నుంచి బయటపడాలి అంటే "సత్యాన్ని" ఆశ్రయించవలసిందే. "సత్యం"లో జీవించవలసిందే. అందుకే "అసతోమా సద్గమయ" అని ప్రార్థించడానికి కారణం.

అందుచేత సత్యమంటే ఏమిటి? అసత్యమంటే ఏమిటి? దేనిని సత్యమంటారు? దేనిని అసత్యమంటారు? అన్నది తెలుసుకుందాం.

ఏదైతే 'బ్రహ్మ'చేత సృష్టి చేయబడిందో అదంతా 'అసత్యమే'. కారణం ఈ సృష్టిలో ఏదీ నిత్యం కాదు. అంటే శాశ్వతం కాదు. ఏది తీసుకున్నా ఎవరిని తీసుకున్నా అన్నీ అశాశ్వతమే. అందరూ తాత్కాలికమే. ఎప్పుడో ఒకప్పుడు అందరూ, అన్నీ అదృశ్యం కావలసిందే! ఇలా అదృశ్యం అయ్యేవన్నీ 'అసత్యాలే!'

అంతేకాదు 'అసత్యం' ఎప్పుడూ మారుతూ, మార్పు చెందుతూ వుంటుంది. మారకుండా వుండదు. అందుకే ఈ సృష్టిలో ఏది తీసుకున్నా, అలా మారుతూనే వుంటాయి. అందుకే అన్నీ అసత్యాలే! చూడండి రోజులు మారతాయి, వారాలు మారతాయి, సంవత్సరాలు మారతాయి, ఆఖరికి యుగాలు కూడా మారుతూ వుంటాయి. 84 లక్షల జీవులు, జీవరాసులు కూడా మారుతున్నాయి. అందుచేత కాలం మారినా, యుగాలుమారినా మార్పు చెందేవన్నీ అసత్యాలే.

మరి ఏది నిత్యమైనది? ఏది శాశ్వతమైనది? ఏది మార్పు చెందనిది? ఏది కాలం మారినా, యుగాలు మారినా మార్పు చెందకుండా వుండేది?

అంటే! అలా మార్పు చెందకుండా వుండేది 'బ్రహ్మ' ఒక్కడే! అందుచేత 'బ్రహ్మే' సత్యం. పెద్దలు 'అసత్యాన్ని' కాదు, 'సత్యాన్ని' ఆశ్రయించండి అని చెప్పడం జరిగింది. సత్యంవైపు నడిపించమని ప్రార్థించడం జరిగింది.

కానీ లోకంలో 'సత్యమంటే' సరైన అవగాహన లేక అసత్యంలోనే జీవిస్తున్నారు. అసత్యాన్నే ఆశ్రయిస్తున్నారు. అసత్యాన్నే పలుకుతున్నారు.

పై వాటి గురించి కొంచెం విపులంగా తెలుసుకుందాం.

బ్రహ్మే 'సత్యమని' తెలుసుకున్నాం. అంటే 'ఆత్మే' సత్యం కాని లోకంలో అంతా దేహం నేననే భావంతో జీవిస్తున్నారు. దేహానికే ప్రాముఖ్యం ఇస్తున్నారు. ఎంతసేపూ దేహసుఖం, దేహ అందం, దేహ సౌష్టవం, దేహ ఆరోగ్యం, దేహ లాభాల కోసమే చూస్తున్నారు. దేహ లాభాల కోసం కావలసిన ధన సంపాదనకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నారు. దేహానికి ఒక పేరు పెట్టుకుని, ఆ పేరుకు, పేరు రావాలని, ఆ పేరు ప్రఖ్యాతి చెందాలని, పేరు ప్రఖ్యాతుల కోసం తాపత్రయ పడుతున్నారు. తపన పడుతున్నారు. ఏమైనా కొద్దిగా వస్తే మురిసిపోతున్నారు.

అలా ఎంతసేపూ దేహాన్ని, దేహ సంబంధమైన వాటి కోసమే జీవిస్తున్నారు. కానీ 'ఆత్మ'ను అంటే 'సత్యాన్ని' అంటే 'బ్రహ్మ'ను పూర్తిగా విస్మరిస్తున్నారు. అలాగే దేహాన్ని ఆశ్రయిస్తూ 'ఆత్మ'ను పూర్తిగా విస్మరిస్తున్నారు.

చూడండి 'ఆత్మ' అంటే 'బ్రహ్మం' అంటే 'దైవం' తప్ప మిగిలినవన్నీ అసత్యాలే!

అసత్యాలనే అస్తమానూ పలుకుతున్నారు. 'సత్యాన్ని' పలకడం లేదు.

అసత్యాలు పలుకుతున్నారనటానికి కొన్ని ఉదాహరణలు చూద్దాం :-

ఒకాయన దేవాలయానికి వెళ్లి వచ్చాడు.

1) వెళ్ళలేదు అంటే 'అబద్ధం' చెప్పినట్టు.

2) దేవాలయానికి వెళ్ళాను అంటే 'అసత్యం' చెప్పినట్టు.

కారణం 'దేవాలయం' అంటే ఏమిటో తెలుసుకుందాం. ఇక్కడ ఆలయం అంటే వుండే ప్రదేశమని అర్థం. ఏది వుంటే ఆ ప్రదేశాన్ని అలా పిలుస్తారు.

చూడండి 'హిమము' అంటే మంచు. మంచు వుండే ప్రదేశాన్ని 'హిమాలయం' అంటారు.

అలాగే దేవుడు వుండే ప్రదేశాన్నే 'దేవాలయం' అంటారు. కానీ వీరు వెళ్ళి వచ్చినది విగ్రహం వుండే ప్రదేశం. అందుచేత అది విగ్రహాలయం మాత్రమే.

మరి నిజమైన దేవుడు వుండే ప్రదేశం అంటే 'దేవాలయం' ఏది? అంటే మానవ దేహం. మానవ దేహమే నిజమైన 'దేవాలయం'. కారణం దేవుడు

అంటే 'ఆత్మ' వుండే ప్రదేశం దేహమే.



అందుకే శంకరాచార్యుల వారు "దేహోదేవాలయో ప్రోక్తః, జీవోదేవో సనాతనః" అన్నారు.

అంటే దేహమే దేవాలయం, దేహంలో వున్న జీవుడే అంటే 'ఆత్మే' సనాతన దైవం అన్నారు.

కానీ ఇక్కడ ఆయన వెళ్ళింది విగ్రహాలయానికే గాని దేవాలయానికి కాదు. అంటే దేవుని విషయంలో అసత్యమే చెప్పాడు కానీ సత్యం చెప్పలేదు.

వెళ్ళిన చోట ధ్యానం చేసి వుంటే అప్పుడు దేవాలయానికి వెళ్ళానని చెప్పొచ్చు. అప్పుడు మాత్రమే 'సత్యం' చెప్పినట్టు. ధ్యానం చెయ్యలేదు అంటే దేహంలోకి వెళ్ళలేదు కాబట్టి 'అసత్యం' చెప్పినట్టే.

అలాగే 'దేవుని ప్రసాదం' తీసుకో అంటారు. ఇది కూడా 'అసత్యం' చెప్పినట్టే. కారణం 'ప్రసాదం' అంటే ప్రసాదించింది అంటే ఇచ్చినది అవి చెప్పుకోవచ్చు లేదా నివేదించినది అంటే చూపించినది అని కూడా చెప్పుకోవచ్చు. కానీ ఇక్కడ పూజారి ఇచ్చాడు కాని దేవుడు ఇవ్వలేదు కదా? అంతేకాదు ఇక్కడ విగ్రహానికి నివేదించారు కాని దేవునికి నివేదించలేదు.

అలాగే దేవునికి అభిషేకం చేయించానని చెపుతారు. అది కూడా 'అసత్యమే' కారణం వీరు అభిషేకం చేయించింది విగ్రహానికి కాని దేవునికి కాదు కదా?

అలాగే దేవునికి ప్రదిక్షణలు చేసాను అంటారు. ఇది కూడా అసత్యమే. కారణం ప్రదిక్షణ దేవునికి చెయ్యడం కాదు, దేవుని చేత విగ్రహానికి చేయించారు. కారణం దేహంలో వున్నది దేవుడు, గుళ్ళో వున్నది విగ్రహం.

ఇలా ఎన్నో సందర్భాలలో దేవుని విషయంలో 'సత్యం' కాకుండా అసత్యమే పలుకుతున్నారు. కారణం 'సత్యం' అంటే సరైన అవగాహన లేకపోవడమే.

కాని వేదాలలో "సత్యంవద, ధర్మంచర" అని చెప్పబడింది. అంటే "సత్యాన్ని వచించాలి అంటే పలకాలి", "ధర్మాన్ని ఆచరించాలి".

అందుచేత సత్యమే పలకాలి, సత్యాన్ని ఆశ్రయించాలి.

కారణం 'సత్యాన్ని' ఆశ్రయించిన వారికి జీవితంలో తప్పక విజయం లభిస్తుంది. అందుకే "సత్యమేవజయతే" అన్నారు.

మరి ఎలాంటి విజయం లభిస్తుంది? అంటే 'సత్యాన్ని' అంటే 'బ్రహ్మ'ను ఆశ్రయించిన వారికి అనంతమైన సృష్టి జ్ఞానం లభిస్తుంది, లేనిది వున్నట్టుగా, ఉన్నది లేనట్టుగా కాకుండా. "ఉన్నది ఉన్నట్టు"గా తెలుసుకుంటారు, చేయవలసినవే చేస్తారు, చేయకూడనివి చేయరు, సృష్టికి అనుగుణంగా ప్రవర్తిస్తారు, కర్మలన్నీ రహితం చేసుకుంటారు, జీవిత లక్ష్యాన్ని సాధిస్తారు, జీవిత గమ్యాన్ని చేరుకుంటారు. చివరకు భూమి మీద పొందవలసిన "నిర్వాణాన్ని" పొందుతారు. శాశ్వత ఆనందాన్ని పొందుతారు.

ఆలోచించండి ఇంతకన్నా సాధించే విజయం ఏముంది? అందుకే "సత్య మేవజయతే" అన్నారు.



అందుకే బుద్ధుడు 'శ్వాస మీద ధ్యాస' వుంచడం ద్వారా "సత్యాన్ని" అనుభవంలోకి తెచ్చుకుని 'నిర్వాణాన్ని' సాధించాడు. దుఃఖం నుంచి శాశ్వతంగా బయటపడే మార్గాన్ని తెలుసుకున్నాడు. అందుకే "సత్యాన్ని" అంటే "బ్రహ్మను" ఆశ్రయించమని... దానికి 'శ్వాస మీద ధ్యాస' మార్గమని అందరికీ బోధించాడు.

అలా 'అసత్యం'లోనుంచి 'సత్యం'లోకి ప్రవేశించినవారు అంధకారం నుంచి వెలుగులోకి ప్రవేశించినట్టే! అంటే వారు అజ్ఞానం తొలగించుకుని జ్ఞానవంతులు అవుతారు.

అందుకే "తమసోమా జ్యోతిర్గమయ" అని ప్రార్థించ మన్నారు. అంటే అజ్ఞానమనే అంధకారం నుంచి జ్ఞానమనే వెలుగులోకి నడిపించ మని

ప్రార్థించడం.

అలా జ్ఞానవంతులైన వారు చివరకు "చచ్చి పుట్టే జీవితం నుంచి చావు పుట్టుకలు లేని స్థితిని" పొందుతారు. అంటే 'అమృతత్వాన్ని' పొందుతారు.

అందుకే "మృత్యోర్మా అమృతంగమయ" అని ప్రార్థించమన్నారు. దీనినే అమృతత్వం అంటారు. దీనినే బుద్ధుడు "నిర్వాణం" అన్నాడు.

ఏ మానవుడైనా చివరకు సాధించవలసినది ఇదే. 'నిర్వాణం' సాధించి నపుడే మానవుడు విజయం సాధించినట్టు. ఇటువంటి విజయం సాధించాలంటే 'సత్యాన్ని' ఆశ్రయించాలి. అంటే 'బ్రహ్మ'ను ఆశ్రయించాలి. బ్రహ్మను ఆశ్రయిం చాలి అంటే 'బ్రహ్మ'ను పొందే విద్యను అంటే 'బ్రహ్మవిద్య'ను తెలుసుకోవాలి.

కానీ లోకంలో అందరిని ఆరాధిస్తున్నారు, అన్నిటిని ఆరాధిస్తున్నారు. కానీ 'సత్యాన్ని' అంటే 'పరబ్రహ్మ'ను ఆరాధించటం లేదు. చూడండి రాళ్ళను ఆరాధిస్తున్నారు. రాళ్ళతో చేసిన బొమ్మలను ఆరాధిస్తున్నారు. మొక్కలను చెట్లను ఆరాధిస్తున్నారు. జంతువులను, పక్షులను ఆరాధిస్తున్నారు. గ్రామ దేవతలను ఆరాధిస్తున్నారు, దేవతలను, ప్రకృతి దేవతలను ఆరాధిస్తున్నారు, గురువులను స్వామీజీలను, బాబాలను ఆరాధిస్తున్నారు. దేవుళ్ళను ఆరాధిస్తున్నారు కానీ 'బ్రహ్మ'ను ఆరాధించడం లేదు. కారణం 'బ్రహ్మ' గురించి తెలియకపోవడం, 'బ్రహ్మ' గొప్పతనం తెలియకపోవడం.

ఒక రకంగా చెప్పాలంటే లోకంలో అందరికీ దేవుళ్ళే గొప్పవారని తెలుసు. అంతేకాదు దేవుళ్ళందరిలోకి "బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే" గొప్పవారని తెలుసు కానీ వారి కంటే గొప్పవాడు 'బ్రహ్మ'. అందుచేత 'బ్రహ్మ'ను మించినవారు మరొకరు లేరని తెలుసుకోవాలి. కారణం ఉన్నది ఆయనే కాబట్టి.

అందుచేత తెలుసుకోండి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలోని బ్రహ్మ వేరు, ఈ 'పరబ్రహ్మ' వేరు. త్రిమూర్తులలోని చతుర్ముఖ బ్రహ్మదేవుడు అయితే ఈ 'పరబ్రహ్మ' దేవాదిదేవుడు అంటే దేవుళ్ళకే దేవుడు.

అందుచేత తెలుసుకోండి "దేవుళ్ళు" వేరు, "బ్రహ్మ" వేరు. అంతేకాదు 'బ్రహ్మ'కు 'దేవుళ్ళకు' చాలా తేడాలున్నాయి.



1) 'బ్రహ్మ'కు రూపం లేదు కానీ, 'దేవుళ్ళకు' రూపాలు వున్నాయి.

2) 'బ్రహ్మ'కు పేర్లు లేవు కానీ 'దేవుళ్ళకు' రకరకాల పేర్లు వున్నాయి.

3) 'బ్రహ్మ' ఒక్కడే. భార్యలు లేరు. కానీ 'దేవుళ్ళకు' భార్యలు వున్నారు.

4) 'బ్రహ్మ' అంతటా వ్యాపించి వున్నాడు. కానీ 'దేవుళ్ళకు' ప్రదేశాలు వున్నాయి. (విష్ణుమూర్తి వైకుంఠంలో, శివుడు కైలాసంలో, బ్రహ్మ బ్రహ్మలోకంలో. అలాగే మిగిలిన దేవుళ్ళు కూడా సత్యలోకంలోని ఒక్కొక్క భాగంలో వున్నారు.)

5) బ్రహ్మ అనంతమైన అపరిమిత శక్తి కలవాడు. కానీ దేవుళ్ళు పరిమిత శక్తి కలవారు.

ఉదా:- పూర్వం ఋషులు, రాక్షసులు ఘోర తపస్సు చేసినపుడు దేవుళ్ళు ప్రత్యక్షమైనప్పుడు రాక్షసులు నాకు చావు లేని వరం కావాలని కోరుకునేవారు. కానీ అపుడు దేవుళ్ళు అది నా చేతిలో లేదు, ఇంక ఏదైనా కోరుకో ఇస్తాను అని అనే వారు. దీనిని బట్టి దేవుళ్ళది పరిమిత శక్తి అని

తెలుస్తుంది.

6) బ్రహ్మకు పుట్టుక లేదు. చావు లేదు. కానీ దేవుళ్ళందరూ తల్లులకు జన్మించారు. అందరూ నిష్క్రమించారు కూడా.

7) బ్రహ్మ మూల చైతన్యం... కానీ దేవుళ్ళు మూల చైతన్యం నుండి ఉద్భవించిన అంశలు మాత్రమే. కానీ జ్ఞానంతో ఎదిగి పూర్ణజ్ఞానంతో పూర్ణాత్మలుగా మారారు.

ఈ విషయమే "ఈశావాశ్య ఉపనిషత్తులో" ఈ శ్లోకం ద్వారా చెప్పబడింది.

**శ్లో॥ ఓమ్ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥**

తా:– అదిపూర్ణం అంటే 'బ్రహ్మం' పూర్ణం. ఇది పూర్ణం అంటే 'బ్రహ్మం' నుండి విడివడి జీవుడిలో ప్రవేశించిన 'జీవాత్మ' కూడా పూర్ణమే.

ఆ పూర్ణ వస్తువు నుండి అంటే 'బ్రహ్మం' నుండి ఉద్భవించిన ఈ పూర్ణ వస్తువు అంటే 'జీవుడు' విద్య చేత (జ్ఞానం చేత) పూర్ణత్వాన్ని సాధించిన పక్షంలో, పూర్ణమైన పరమాత్మగా శేషిస్తుంది. అంటే 'బ్రహ్మం'గా విలసిల్లుతుంది. అంటే 'పూర్ణాత్మ'గా తయారవుతుంది. అంటే 'సహ సృష్టికర్త' (కోక్రియేటర్) అవుతుంది.

అటువంటి 'బ్రహ్మ'ను ముస్లింలు 'అల్లాహ్' అని పిలుస్తారు. క్రిస్టియన్లు "తండ్రీ" అని పిలుస్తారు. హిందువులు అనేక పేర్లతో పిలుస్తారు. 'ఆదిశక్తి', 'పరాశక్తి', 'లలితా', 'పరబ్రహ్మ', 'పరమాత్మ', 'విశ్వాత్మ', ఇలా రకరకాల పేర్లతో పిలుస్తారు. అందుచేత దేవుళ్ళు వేరు, 'బ్రహ్మ' వేరు అని తెలుసుకోండి. 'బ్రహ్మ' యొక్క గొప్పతనం మాటలతో వర్ణించలేనిది, చెప్పలేనిది. ఒక రకంగా చెప్పాలంటే మానవ ఇంద్రియాలకు ఆ శక్తి లేదనే చెప్పాలి. అంత గొప్ప వాడు 'బ్రహ్మ'.

ఈ విషయమే **'గురుగీత'**లో పరమేశ్వరుడు పార్వతీదేవికి బోధించడం జరిగింది.

# "గురుగీత!"

## పార్వతీ దేవి సందేహాలకు  పరమేశ్వరుని సమాధానం



**పార్వతీదేవి పరమేశ్వరునితో:-**

**శ్లో॥ ఓం నమోదేవ! దేవేశ! పరాత్పర! జగద్గురో!**
**త్వాం నమ స్కుర్వతే భక్త్యా సురాసురనరా స్సదా ॥**

**శ్లో॥ విధివిష్ణు మహేన్ద్రాద్యై ర్వన్ద్యం ఖలు సదా భవాన్**
**నమ స్కరోషి కస్మైత్వం నమస్కారాశ్రయః కిల ॥**

**శ్లో॥ దృష్ట్వా ఏతత్ కర్మ విపులం ఆశ్చర్యం ప్రతిభాతిమే**
**కిమే తన్న విజానేహం కృపయా వద మే ప్రభో! ॥**

తా:- ఓ దేవా! దేవేశా! పరాత్పరా! జగద్గురో! దేవతలు, రాక్షసులు, మనుషులు నిరంతరం భక్తితో నీకు నమస్కరిస్తున్నారు.

మహేశ్వరా! నీవు బ్రహ్మ విష్ణు మహేంద్రుల చేత సదా స్తుతింప బడుచున్నావు.  సర్వ దేవతలు నమస్క రించుటకు నీవు అర్హుడవై ఉన్నావు. అట్టి నీవు ఎవరికి నమస్కరించుచున్నావు?

మీరు నమస్కరించడం చూసి నేను చాలా ఆశ్చర్య పోతున్నాను. ఈ నమస్కారానికి కారణమేమిటో నాకు తెలియడం లేదు. కనుక ఓ ప్రభో! దయ చేసి ఈ విషయం నాకు తెలపండి.

**పరమేశ్వరుడు :-**

**శ్లో॥ అజోహ మజరం నిత్యమనాదిం నిత్యతాం గతం**
**అర్జవికారం చిదానందం ప్రణవాంతం స్మరామ్యహం**

తా:- దేవి, నేను జరామరణములు లేనివాడిని. జన్మ, బంధాలు లేని వాడిని, మృత్యుంజయుడను. అయినా, నేనూ నా హృదయంలో వున్న 'పరబ్రహ్మ'ను నిత్యం ఆరాధిస్తాను.

'పరబ్రహ్మ' 'కాలాతీతుడు', 'నిత్యచైతన్యం', 'బ్రహ్మనికి' వార్ధక్యం, క్షతి లేదు. ఆయన 'అనంతుడు', 'శాశ్వతుడు'. 'ఆది-అంతం' లేని వాడు. పరిణామం చెందనివాడు, 'పరబ్రహ్మ' అనగా విశ్వ చైతన్యం, సచ్చిదానందాన్ని మించిన బ్రహ్మానందం.

నావలె ప్రతియోగి, ప్రతిసాధకుడు తన హృదయంలో, చిదాకాశంతో, అంగుష్ఠమాత్రుడై వెలిగే పురుషుని, జీవుని, జ్యోతిని ఆరాధించాలి. **మనిషిగా జన్మించిన ప్రతి జీవికి 'పరంజ్యోతి' దర్శనం ప్రథమాశయం కావాలి.**

**పార్వతి దేవి :-**

**శ్లో॥ కేన మార్గేణ లో స్వామిన్ దేహి బ్రహ్మమయోభవేత్**
**తత్ కృపాం కురుమేస్వామిన్ నమామి చరణేతవ.**

తా:- "స్వామి! అలాంటప్పుడు ఏ తపస్సు చేసినా, బ్రహ్మనుభూతి ముఖ్యం కదా? అటువంటి బ్రహ్మనుభూతిని పొందగల మార్గం ఏది? ఆ మార్గాన్ని నాకు ఉపదేశించండి. నేను మీకు సంపూర్ణంగా శరణాగతురాలిని అవుతున్నాను. తమరిని నా గురువుగా భావిస్తున్నాను. నన్ను అనుగ్రహించండి మహాత్మా."

**పరమేశ్వరుడు :-**

**శ్లో॥ అపూర్వా నందతం నిత్యం స్వయం జ్యోతిర్నివామయం**
**విరజస్కం పరంశంభుం ఆనందం పరమ వ్యయం.**

తా:– 'పరబ్రహ్మాన్ని' గుర్తించడం సులభం కాదు. ఊహించినంత సుకరం కాదు. 'పరబ్రహ్మా'కు రూపం, గుణం లేవు కనుక ఫలానా రూపం, ఫలానా గుణమని చెప్పలేం. కొన్ని సంకేతాలు వున్నాయి. అవి అనుభూతికి తెలుస్తాయి. అపూర్వమైన ఆనందం కలిగించే గుణం 'పరబ్రహ్మది'. ఆ ఆనందం వ్యక్తం చేయ వీలుకాదు కనుక అది అవ్యక్తానందం. అది యోగి మాత్రమే గ్రహించగల, అనుభవించగల మధురానందం. అది ఎప్పటికప్పుడు క్రొత్తగా అనిపిస్తుంది. కనుక 'నిత్య నూతనం'. అది 'దివ్య పరిమళభరితం'. అది 'ఆత్మ జ్యోతి'. హృదయంలో చల్లగా, నెమ్మదిగా వెలుగుతుంది. ప్రకాశిస్తుంది. లోకంలోని ఏ సుఖంతో కాని, సంతోషంతో కాని, బ్రహ్మానందాన్ని పోల్చలేం.

**శ్లో ॥ అగోచరం, తథాగమ్యం నామరూపాది వర్జితం**
**నిశ్శబ్దం తం విజా నీయాత్ స్వభావం బ్రహ్మ పార్వతి.**

తా:– పార్వతీ! 'పరబ్రహ్మం' 'అగోచరం'. ఎక్కడా కనిపించదు. కను విందు చేయదు. పైగా 'అగమ్యం'. అంటే ఈ మార్గాన వెతుకుతే దొరుకుతుందని చెప్పలేం. ఏ మార్గమో తెలియదు. 'బ్రహ్మాన్ని' చేరాలంటే అసలు మార్గమేలేని మార్గంలో ప్రయాణం చెయ్యాలి.

ఆ 'బ్రహ్మానికి' రూపం లేదు. పేరు లేదు. ఆయన్ను అన్వేషించేవారికి 'దేహస్మృతి' ఉండకూడదు. తన ఊరు, పేరు, ఉనికి మరిచిపోవాలి. మరో కంటితో చూడాలి. అదే 'జ్ఞాన నేత్రం'. 'జ్ఞానికి' మాత్రమే అందేది పరబ్రహ్మ తత్వం. మానవులకు సమస్త జీవజాలానికి సుఖాలు ప్రసాదించేది, మనుగడకు సహకరించేది 'పరబ్రహ్మమే'. ఆయన ఆవాసం నిశ్శబ్దం, ప్రశాంతి.

**శ్లో॥ యథా నిజ స్వభావేన కర్పూర కుసుమాదిషం**
**శీతోష్ణాది స్వభావశ్చ తథా బ్రహ్మాచ శాశ్వతం**

మానవులను రూప, గుణ, స్వభావాలను బట్టి గుర్తించవచ్చు. రూప ప్రపంచంలో చరాచరాలన్నింటికి రూపం వుంటుంది. కొన్నింటికి స్వభావం ప్రధానం (కర్పూరానికి వేడిచేసే గుణం వున్నట్లు, పూలకు చలవ చేసే గుణం వున్నట్లు) పరబ్రహ్మకు 'అనంతత్వం' గుణ స్వభావం అందుచేత శాశ్వతుడైన

పరబ్రహ్మను తాత్వికంగానే గుర్తించగలం. ఇతరాలైన రూప, నామ, గుణ స్వభావాలతో మాత్రం వీలుపడదు.

**శ్లో॥ అంకి మత్ర బహునోక్తేన శాస్త్రకోటి శతే నచ**
**దుర్లభా చిత్త విశ్రాంతిః సద్గురోః కరుణం వినా!**

శాస్త్రాలకేం వందలు వేలు వున్నాయి, ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎంతగా శాస్త్రపాండిత్యం గడించినా, ఆత్మకు శాంతి లభించదు. ఎంత వెతికినా శాస్త్రాలలో సరైన ముక్తిమార్గం కనిపించదు. **మనశ్శాంతి కరువై, చిత్తచాంచల్యంతో కొట్టుమిట్టాడే వానికి 'సద్గురువు' లభిస్తే శాస్త్రపాండిత్యంతో పని ఉండదు. 'సద్గురువు' తప్ప 'బ్రహ్మ విద్య'ను బోధించగల వారు ఎవరూ వుండరు. ఏ శాస్త్రమూ గురువు చేసే పని చేయదు** అని పరమ శివుడు 'పరబ్రహ్మ' యొక్క గొప్పతనాన్ని.ఆయనను పొందే మార్గాన్ని బోధించడం జరిగింది.

పరమేశ్వరుని పై సందేశం ప్రకారం తనలోనే కాదు, సకల దేవతలలో, మానవులలో, సమస్త జీవులలో జ్యోతిలా వెలిగే! కనిపించని, వ్యక్తం చేయలేని 'పరబ్రహ్మ'ను పరమేశ్వరుడు నిత్యం ధ్యానిస్తున్నాడు అని తెలుసుకోవాలి.

అంతటి గొప్పవాడైన 'పరబ్రహ్మ'ను రూపంతో, నామంతో, గుణంతో తెలుసుకోలేమని తెలుసుకోవాలి. ఆయనను ఈ కళ్ళతో చూడలేము. ఆ తత్వాన్ని జ్ఞాననేత్రంతోనే దర్శించుకోగలమని తెలుసుకోవాలి. అంతేకాదు దేహస్మృతి మరచిపోవాలి అని పరమేశ్వరుడు చెపుతూ, అదే నేనూ చేస్తున్నాను, నీవు కూడా ఆయన్నే ధ్యానించు అని పార్వతీ దేవికి చెప్పడం జరిగింది.

ఆయన ఇంకా మానవునిగా జన్మించిన ప్రతీ ఒక్కరు తన హృదయంలో వెలిగే 'పురుషుని' అంటే 'ఆత్మ'ని ఆరాధించాలి. అదే ప్రతీ ఒక్కరి మొదటి ఆశయం కావాలని అంటే 'పరబ్రహ్మ' దర్శనమే జీవిత లక్ష్యం కావాలని పరమేశ్వరుడు బోధించడం జరిగింది.

మరి ఆ బ్రహ్మానుభూతి పొందాలంటే, దేహ స్మృతి ఉండకూడదు. తన ఊరు, పేరు, ఉనికి మరిచిపోవాలని అన్నారు. మరి దేహస్మృతి అంటే దేహభావం, మనసు వల్ల కలుగుతుంది కాబట్టి మనసును శూన్యం చేసుకోవాలి.

ఆ మార్గమే "శ్వాస మీద ధ్యాస" వుంచి "ధ్యానం" చెయ్యడం.

'బ్రహ్మ' అనంత శక్తి స్వరూపుడు అని అనటానికి ఈ ఉదాహరణ చూద్దాం. ఎవరైనా చనిపోయినపుడు అంటే 'బ్రహ్మ' అంటే 'ఆత్మ' శరీరాన్ని వదిలి వెళ్ళిపోయినప్పుడు శరీరం వెంటనే శవమైపోతుంది. ఆ వెను వెంటనే ఆ శవాన్ని ఇంటి బయట పడుకోబెడతారు.

విచిత్రమేమిటంటే ఆ శరీరం అప్పటి దాకా అన్ని పనులు చేసింది. కళ్ళు చూసాయి, నోరు మాట్లాడింది, చెవులు విన్నాయి, చేతులు, కాళ్ళు పని చేసాయి కానీ 'బ్రహ్మ' తప్పుకోగానే శరీరం ఏమీ చేయలేకపోతుంది. అందుకే శవమన్నారు.

కొంచెం ఆలోచించండి ఆ వూరిలోని స్పెషలిస్టు డాక్టర్లందరినీ పిలిపించి మీరు కోరినంత ఫీజు ఇస్తాం, 'ఆత్మ' లేని అంటే 'బ్రహ్మ' లేని ఈ శరీరాన్ని పని చేయించండి అంటే చేయగలరా? వెంటనే మా వల్ల కాదని ఖచ్చితంగా చెప్పేస్తారు. పోనీ హైదరాబాద్‌లో వున్న స్పెషలిస్టు డాక్టర్లు అందరినీ, వారి లేటెస్ట్ టెక్నాలజీతో ఉన్న ఎక్విప్‌మెంటుతో సహా వచ్చి ఆ శవాన్ని నడిపించక్కరలేదు. కనీసం చేయి అయినా కదిపించగలరా? అంటే మా వల్ల కాదు అని రాకుండానే చెప్పేస్తారు. పోనీ ప్రపంచంలోని స్పెషలిస్టులు, సైంటిస్టులు, మేధావులు అందరినీ తీసుకు వచ్చినా, ఆ శవం చెయ్యి కదిపించగలరా? అంటే అంతా మా వల్ల కాదు అని చెపుతారు.

దీనిని బట్టి ఈ ప్రపంచంలోని 700 కోట్ల మంది చేయలేని పని ఒక్క 'బ్రహ్మ' చేస్తున్నాడు అంటే 'బ్రహ్మ' యొక్క శక్తి ఎంత గొప్పదో వూహించవచ్చు. ఇంకా విచిత్రం ఏమిటంటే 700 కోట్ల మంది చేయలేని పని ఒక్క 'బ్రహ్మ' చేయిస్తున్నాడు. ఆయన ఒక్క మానవ శరీరం చేత ఇన్ని రకాల పనులు చేయించడం కాదు, 700 కోట్లకు పైగా వున్న ఈ మానవులందరి చేతనే కాదు, ఈ సృష్టిలోని 84 లక్షల జీవరాసుల చేత కూడా ఈ పనులన్నీ చేయిస్తున్నాడు.

ఆలోచించండి ఒక్కో జీవరాసిలో ఎన్ని కోట్లు జీవులు వున్నాయో!

అన్ని కోటానుకోట్లు జీవులు, జీవరాసుల మనుగడకు కారణం ఆ 'పరబ్రహ్మ' ఒక్కడే అంటే ఆయన శక్తి అనంతం కాక మరేమిటి? అందుకే ఆయనను 'అనంతశక్తి స్వరూపుడు' అన్నారు.

'పరబ్రహ్మ'కు వున్న శక్తి మానవులకే కాదు దేవతలకు కూడా లేదనే చెప్పాలి. ఈ విషయమే ఉపనిషత్తులలోని ఈ క్రింది కథ ఆధారంగా తెలుసు కోవచ్చు.

'కేనోపనిషత్తు'లో 'బ్రహ్మం' యొక్క గొప్పతనం తెలియచేసే ఈ కథ తెలుసుకుందాం.

పూర్వకాలంలో రాక్షసులకు, దేవతలకు ఘోర యుద్ధం జరిగింది. చివరకు యుద్ధంలో దేవతలు గెలిచారు. అలా గెలవడంతో దేవతలు, గర్వంతో విర్రవీగడం మొదలుపెట్టారు. మేము కాబట్టి రాక్షసులను జయించగలిగాము. మేమే ఈ విజయాన్ని సాధించగలిగాము అనే అహంకారంతో లోకంలో మా



కంటే గొప్పవారు ఎవరూ లేరని అనుకోసాగారు.

ఆ 'పరబ్రహ్మ' దేవతల ఉద్దేశ్యాన్ని గమనించాడు. ఇలా గర్వంతో విర్రవీగితే చెడిపోతారనే ఉద్దేశ్యంతో దేవతలకు గుణపాఠం నేర్పాలనుకున్నాడు.

ఒకరోజు ఇంద్రసభ జరుగుతూ వుండగా ఆ 'పరబ్రహ్మ' అతి ప్రకాశ వంతమైన యక్షుని రూపంలో దేవతలకు కాస్త దూరంలో ప్రత్యక్షమయ్యాడు.



మహాతేజ స్వరూపంతో వున్న ఆ యక్ష స్వరూపాన్ని చూసి దేవతలందరూ ఆశ్చర్యపోయారు. ఆయన ఎవరో ఎవరికీ అర్థం కాలేదు. అప్పుడు వారంతా 'అగ్ని'ని ఆయన ఎవరో తెలుసుకుని రమ్మని పంపారు.

అపుడు అగ్ని ఆ యక్షుని సమీపించాడు. అపుడు యక్షుడు అగ్నిని "నువ్వు ఎవరు?" అని ప్రశ్నించాడు.

అపుడు నేను అగ్నిదేవుణ్ణి. లోకంలో చాలా ప్రఖ్యాతి చెందిన వాడిని అని సమాధానం ఇచ్చాడు.

అంత ప్రసిద్ధుడవైతే నీ శక్తి సామర్థ్యాలు ఏమిటి? అని యక్షుడు ప్రశ్నించాడు.

తేజస్వీ! నా పరాక్రమం నీకు తెలియదా భూమి మీద దేనినైనా నేను భస్మీపటలం చేయగలను అని గర్వంగా సమాధానం ఇచ్చాడు.

అది విన్న యక్షుడు అగ్ని ముందు ఒక గడ్డిపరక పడవేసి "అలా అయితే ఈ గడ్డి పరకను దగ్ధం చెయ్యి" అన్నాడు. అపుడు అగ్ని తన శక్తినంతా ఉపయోగించినా ఆ గడ్డిపరకను ఏమీ చేయులేకపోయాడు. సిగ్గుతో తలదించుకుని వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

అపుడు దేవతలందరూ వాయువును పంపారు. వాయువు యక్షుణ్ణి సమీపంచగానే యక్షుడు నువ్వు ఎవరు? నీలో గల సామర్థ్యం ఏమిటి? అని ప్రశ్నించాడు. అపుడు వాయువు గర్వంగా నేను వాయుదేవుణ్ణి, ఈ భూమిపై వున్న వాటినన్నీ ఎగరగొట్టగలను. ఈ బ్రహ్మాండాన్నే ఒక్క క్షణంలో ఊపేస్తాను. ఒకే క్షణంలో భూమి, ఆకాశాన్ని ఒకటి చేస్తాను" అని వాయువు అన్నాడు.

అపుడు యక్షుడు అలా అయితే ఈ గడ్డి పరకను ఎగరగొట్టు అని వాయువు ముందు గడ్డి పరకను వుంచాడు. వాయువు గడ్డి పరకను ఎగర గొట్టడానికి తన శక్తినంతా ఉపయోగించాడు కానీ ఏమీ చేయలేకపోయాడు. అలా వాయువు కూడా వెనుదిరిగాడు.

అపుడు దేవతలందరూ కలిసి తమ రాజైన ఇంద్రుణ్ణి ఆ పనికి పురమాయించారు. అపుడు ఇంద్రుడు సరేనని ఆ యక్షుని సమీపించబోగా, యక్షుడు అంతర్ధానమయ్యాడు. అపుడు ఇంద్రుడు ఆశ్చర్యంతో అటు, ఇటూ చూస్తుండగా ఆయనకు పార్వతీదేవి ప్రత్యక్షమైంది. అపుడు ఇంద్రుడు ఆమెకు నమస్కరించి, “దేవీ! దేవతలందరినీ భయభ్రాంతులను చేసిన ఆయన ఎవరు?” అని అడిగాడు.

ఆయనే ‘పరబ్రహ్మ’ అని పార్వతీదేవి సమాధానం చెప్పింది. అన్నింటిలో అంతర్లీనంగా వుండే ఆ ‘పరబ్రహ్మ’మే మీ విజయానికి కారణం ఆ ‘బ్రహ్మ’ వలననే మీరు యుద్ధంలో రాక్షసులను జయించగలిగారు. ఈ నిజం తెలుసు కోలేక మేమే మా బల పరాక్రమాలతో రాక్షసులను జయించామని గర్వంతో మీరు విర్రవీగుతున్నారు. మీ అహంకారాన్ని తొలగించడానికి ఆ ‘బ్రహ్మ’మే తన మాయా శక్తిని మీ ముందు ప్రదర్శించాడు. కానీ ఆయన సహకారం లేకపోయే సరికి మీరు కేవలం గడ్డి పరకను కూడా కదల్చలేక పోయారు. అందుచేత, మీలో ఏదైనా శక్తి వుందంటే అది ఆ పరబ్రహ్మదేనన్న విషయాన్ని తెలుసుకోండి, గర్వించకండి అని చెప్పి పార్వతి అంతర్ధానమయ్యింది.

అపుడు ఆ శక్తి స్వరూపం ‘బ్రహ్మ స్వరూపమని’ ఇంద్రుడు తెలుసు కున్నాడు. ఇంద్రుని వలన మిగిలిన దేవతలు కూడా ఈ సత్యాన్ని తెలుసు కున్నారు.

పై కథను బట్టి దేవతలు ప్రదర్శిస్తున్న శక్తి వారిది కాదని, వారి శక్తి అంతా ‘బ్రహ్మ’ దే అని అర్థమవుతుంది. ‘బ్రహ్మ’ శక్తి వల్లే వారు తమ బలాన్ని అలా ప్రదర్శించగలిగారు. రాక్షసులను ఓడించగలిగారు. ‘బ్రహ్మ’ శక్తి లేకపోతే

వారు గడ్డిపోచను కూడా కదిలించలేకపోయారు. అంటే అంత శక్తి హీనులయ్యారు.

అంతెందుకు మానవులనే తీసుకోండి నేను ఇంతవాణ్ణి, అంతటి వాణ్ణి నేను తలచుకుంటే ఏమైనా చేయగలను. వాడెంత? వీడెంత? నాకు ఆ పలుకుబడి వుంది, ఈ పదవులు వున్నాయి. వీరంతా నా వెనకాల వున్నారు, నేను తలుచుకుంటే వాడిని నిమిషంలో లేపేయగలను. నేను అది సాధించాను, ఇది సాధించాను అని ప్రగల్భాలు పలికేవారు చాలా మంది వున్నారు.

కొంచెం ఆలోచించండి అలా ప్రగల్భాలు పలికిన వాడికి ఆ రాత్రి గుండెపోటు వచ్చి 'ఆత్మ' తప్పుకుందనుకోండి ఏమవుతుంది? వాడు శవం అవుతాడు. వెంటనే వాడిని ఇంటి బయట పడుకోపెడతారు. అప్పుడు వాడిని అడగండి ఏరా! నిన్న వాడిని లేపేస్తానన్నావు, వాడు వచ్చాడు ఒక్కసారి వాడి సంగతి చూడు అని అనండి. అంటే లేస్తాడా? కదులుతాడా? ఏమైనా చేయగలడా? ఏమీ చేయలేడు సరికదా! ఆఖరికి గడ్డి పరక అక్కడ పెట్టినా దాన్ని కూడా కదపలేడు. మరి నిన్న అన్ని ప్రగల్భాలు పలికాడు? ఇప్పుడు ఏమీ ఎందుకు చెయ్యలేకపోతున్నాడు?

అంటే నిన్న 'బ్రహ్మ' అంటే 'ఆత్మ' వుంది. ఈ రోజు 'బ్రహ్మ' నిష్క్రమించాడు అంటే 'ఆత్మ' వెళ్ళిపోయింది. అంటే వాడి శక్తి అంతా 'బ్రహ్మ'దే కాని వాడిది కాదు అని అర్థమవుతుంది. 'బ్రహ్మ' వున్నాడు కాబట్టే వాడు 'హీరో'లా ప్రవర్తించాడు. కానీ బ్రహ్మ లేకపోయేసరికి వాడు 'జీరో' అయిపోయాడు. అందుచేత తెలుసుకోండి. ఎవరి హీరోయిజమైనా వారిది కాదు 'బ్రహ్మ'దే. 'బ్రహ్మ' లేకపోతే అంతా 'జీరో'లే.

మనం కొంచెం గమనిస్తే లోకంలో చాలా మంది చాలా గొప్పలు చెప్పుకుంటారు. గర్వంతో విర్రవీగుతూంటారు. అహంకారంతో వ్యవహరిస్తూ వుంటారు. నేను నా కష్టంతోనే బాగా డబ్బు సంపాదించానని, కొంతమంది నా తెలివితోనే ఈ పదవులు సంపాదించగలిగానని, మరికొంతమంది ఇంత పెద్ద ఉద్యోగం చేయగలుగుతున్నానని, మరికొంతమంది నేను బాగా

పాడగలుగుతున్నానని, ఆడగలుగుతున్నానని, నటించగలుగుతున్నానని, ఇంత పైకి రాగలిగానని గర్వించే వారు ఎంతోమంది వున్నారు. దేవతలులాగే గొప్పలు చెప్పుకునేవారు చాలామంది వున్నారు. కానీ వున్న సత్యమేమిటంటే వారి గొప్పతనానికి కారణం వారు కాదు, 'పరబ్రహ్మ'. 'పరబ్రహ్మ' లేకపోతే వారు ఏమీ చేయలేరు. హీరోలమనుకునే వారంతా జీరోలయిపోతారు.

అందుచేత వున్నవి చూసుకుని వూరికే మిడిసిపాటు పడకండి, గర్వించకండి, అహంకరించకండి. అసలు ఇక్కడ 'నేను' అనేది లేనే లేదు. వున్నదే ఆయన అంటే 'బ్రహ్మ'. 'బ్రహ్మ' తప్ప ఇంకొకటి వూహించటానికి, ఇంకొకటి ఏదైనా వుంటే కదా? వున్నదే ఆయన.

ఈ విషయమే 'ఈశావాస్యోపనిషత్తు'లో ఈ శ్లోకం ద్వారా చెప్పబడింది.



**"ఈశావాస్యమిదం సర్వం, యత్కించజగత్యాం జగత్!**
**తేనత్యక్తేన భుంజీథా మాగృథః కస్య స్విద్ధనమ్"**

తా:- ఈ సమస్త సృష్టిలో ఏ చరాచర వస్తు జాలం వుందో అదంతా సర్వైశ్వర్య సంపన్నుడైన 'బ్రహ్మ' అంటే భగవంతునిచే వ్యాప్తం. కాబట్టి త్యాగ భావంతో ఈశ్వర మయమైన ఈ ప్రపంచాన్ని అనుభవించు. ఎవరి ధనాన్ని

ఆశించకు, ఎవరిదీ అపహరించకు.

అంటే ఈ ప్రపంచంలో గల సమస్త చరాచరాలన్నింటినీ ఈశ్వరుడనే దృష్టితో చూడాలి.

అంతేకాదు ఆ 'బ్రహ్మ' స్వరూపాన్ని తెలుసుకోవటానికి ఈ ఉపనిషత్తు లోనే ఈ విధంగా చెప్పబడింది.

'బ్రహ్మ' అంటే 'ఆత్మ' చలన రహితం అయినా మనస్సు కంటే వేగవంతమైనది. ఇంద్రియాలు దీన్ని గ్రహించలేవు. ఎందుకంటే మనస్సు ఎక్కడకు పోతుందో? మనస్సు కంటే ముందే 'ఆత్మ' అక్కడ వుంటుంది కాబట్టి. ఈ 'ఆత్మ' పరుగెడుతున్న వికార్యాలైన ఇతర విషయాలన్నిటిని దాటిపోతుంది. 'ఆత్మ' అంటే 'బ్రహ్మ' తన సన్నిధి మాత్రం చేత ప్రాణికోట్ల కార్యకలాపాలను భరించటానికి ప్రాణశక్తిని కార్యోన్ముఖం చేస్తుంది.

'ఆత్మ' చలిస్తుంది. తన నిజమైన కేవల స్థితిలో చలించదు. 'అజ్ఞానులకు' దూరంలో, 'ప్రజ్ఞానులకు' అతి దగ్గరలో వుంది. అది అంతటా వుంది, లోపలా వుంది, వెలుపలా వుంది.

'బ్రహ్మ' అంటే 'ఆత్మ' సర్వవ్యాపకం, తేజోవంతం. దానికి శరీరం లేదు. 'బ్రహ్మ' సర్వద్రష్ట, సర్వజ్ఞుడు, సర్వోత్కృష్టుడు అంటే అన్నింటికి పైన వుండేవాడు. 'స్వయంభువు' అంటే స్వతసిద్ధుడు.

ఇంకా తెలుసుకోవాలంటే నిద్రించి వున్న సర్వ జీవుల్లోనూ ఏ పురుషుడు మేలుకొని వున్నాడో అదే నాశరహితమైన, పరిశుద్ధమైన 'బ్రహ్మం'. ఆ పరమాత్మలోనే సమస్త లోకాలు ఆశ్రయించి వున్నాయి. జన్మ, వృద్ధి, పరిణితి, ప్రక్షయ, వ్యాధి, నాశనం లాంటి ఆరు వికారాలు లేని వాడు 'బ్రహ్మ'.

అందుకే అంతా ఆయనే, అన్నీ ఆయనే అని అంటారు. అన్నిటిలోనూ ఆయనే. అన్నీ ఆయనే అయినపుడు ఇక్కడ నేను అనుకోవడమే విచిత్రం. అందరూ లేనిది వుంది అనుకుంటున్నారు. దీనినే 'మాయ' అంటారు. అంటే అందరూ మాయలో వున్నారని అర్థం.

ఆలోచిస్తే ఇదంతా చాలా విచిత్రంగా కనిపిస్తుంది. లేకపోవడమేమిటి

అంతా వున్నారు కదా? అన్నీ వున్నాయి కదా? ఏమీ లేదంటారేమిటి? అంతా గందరగోళం ఏమీ అర్థం కాదు. కానీ 'బ్రహ్మజ్ఞానం' పొందిన వారికి అంతా ఆయనే అన్నీ ఆయనే. అన్నిటిలోనూ ఆయనే. ఆయన తప్ప వేరే ఏమీ లేదని తెలుస్తుంది.

అందుకే వేదాలలో **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** అన్నారు. అంటే సమస్తం బ్రహ్మమయం అని అర్థం. ఎలాగో కొద్దిగా చూద్దాం.

మనకి ఈ సృష్టిలో కోటానుకోట్లు లోకాలు, విశ్వాలు, గ్రహాలు వున్నాయని తెలుసు. ఈ లోకాలలో కొన్ని భౌతిక లోకాలు అంటే కంటికి



కనిపించేవి, కొన్ని సూక్ష్మలోకాలు అంటే కంటికి కనిపించనివి వున్నాయి. కంటికి కనిపించేలోకాలే కోటానుకోట్లు వున్నాయంటారు. ఎన్నో భూ మండలాలు, సూర్య గోళాలు, నక్షత్రాలు, విశ్వాలు వున్నాయంటారు. ఈ మధ్యనే శాస్త్ర వేత్తలు కొత్తగా భూగ్రహం లాంటి ఏడు గ్రహాలను కనిపెట్టారు. దీనిని బట్టి తేలికగా వూహించవచ్చు. మనం కనిపెట్టనంత మాత్రాన లేవని అనుకొనక్కరలేదు. మరి ఈ గ్రహాలలో కోటానుకోట్ల జీవులు, జీవరాసులు కూడా వున్నాయి. 84 లక్షల రకాలు వున్నాయని అంటారు. ఒకోరకంలోనే కొన్ని కోట్లకు మించి వున్నాయి అంటారు. ఒక్క మానవ జాతే ప్రస్తుతం భూమి మీద 700 కోట్లకు పైగా వుందని మనకు తెలుసు. అంతేకాదు భూమి

మీద శరీరం వదలిన వారు శరీరం తీసుకోవడానికి సిద్ధంగా వున్నవారు పై లోకాలలో ఎన్ని కోటానుకోట్ల మంది వున్నారో మనం వూహించలేం. ఇంకా ఆలోచిస్తే ఎన్ని జీవరాసులు వున్నాయో మనం అంచనా కూడా వేయలేం. మరి ఇవన్నీ ఎలా ఏర్పడ్డాయి? ఎలా సృష్టింపబడ్డాయి? ఎవరు సృష్టించారు? అన్నది తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం.

ఈ సృష్టికి ముందువున్నది ఒక్కడే ఒక్కడు ఆయనే 'బ్రహ్మ'. ఈ విషయమే ఉపనిషత్తులలో చెప్పబడినది. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అంటే ఒక్క 'బ్రహ్మము' తప్ప రెండవది లేదు. ఆ 'బ్రహ్మ'నే 'మూలచైతన్యం', 'విశ్వాత్మ', 'పరమాత్మ', 'ఆదిశక్తి', 'పరాశక్తి', 'లలితాదేవి' అంటారు. ఏ పేరుతో పిలుచుకున్నా ఆయన సంకల్పంతోనే, ఈ సృష్టిని సృష్టి చేయడం జరిగింది.



సాలె పురుగు తన నుంచి గూడును ఎలా సృష్టించడం జరిగిందో! అలా 'బ్రహ్మ' మొదట తన నుంచిపంచభూతాలను, ఈ సమస్త లోకాలను సృష్టించడం జరిగింది. అందుచేత ఈ పంచ భూతాలు ఆయనే అని చెప్పుకోవచ్చు. ఆయన లేకపోతే పంచభూతాలు వుండవు కదా? పంచ భూతాలు అంటే 1) భూమి, 2) నీరు, 3) అగ్ని, 4) వాయువు, 5) ఆకాశం.

అందుచేత "స్థలం" బ్రహ్మమే, "జలం" బ్రహ్మమే, "అగ్ని" బ్రహ్మమే, "వాయువు" బ్రహ్మమే, "ఆకాశం" కూడా బ్రహ్మమే అని తెలుసుకోవాలి.






తరువాత యీ పంచభూతాల నుండి 84 లక్షల రకాల జీవులు, జీవరాసులు సృష్టించబడ్డాయి.



వృక్షజాతి ఏకభూతతత్వంతో అంటే నీటితో సృష్టింపబడ్డాయి.



అలాగే క్రిమికీటకాలు, సర్పజాతి ద్విభూత తత్వంతో అంటే భూమి, నీరుతో సృష్టింపబడ్డాయి.



అలాగే పక్షిజాతి త్రిభూతత్వంతో అంటే నీరు, అగ్ని, వాయువుతో సృష్టింపబడ్డాయి.



జంతు జాతి నాలుగు భూత తత్వాలతో అంటే భూమి, నీరు, అగ్ని, వాయువులతో  సృష్టింపబడ్డాయి.



అలాగే మానవ జాతి పంచభూతాలు అంటే భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశాలతో సృష్టింపబడింది. అందుకే మానవ శరీరాన్ని 'పాంచభౌతికం' అని అంటారు.

ఇక్కడ మనం గమనిస్తే పంచభూతాలు 'బ్రహ్మ' నుంచే ఏర్పడ్డాయి అంటే పంచభూతాలు ఆయనే అని తెలుస్తుంది. అలాగే పంచభూతాల నుండి ఈ సమస్త జీవులూ, జీవరాసులు ఏర్పడ్డాయి. అంతేకానీ వేరే ఏదో వచ్చి వీటిలో కలవలేదు. అందుచేత సమస్త జీవులు, జీవరాసులలో 'బ్రహ్మ' తప్ప మరొకటి లేదు.

అలా ఏర్పడిన ఆకారాలకు, శరీరాలకు చైతన్యం కలిగించడానికి అంటే కదలికలు, ఎదుగుదల కలిగించడానికి 'బ్రహ్మ' అంటే 'మూలచైతన్యం' తన నుంచి అంశలను విడదీసి ప్రతి ఆకారంలో, శరీరంలో ప్రవేశపెట్టడం జరిగింది. అప్పటి నుంచి అవి జీవించడం ప్రారంభించాయి. అలా జీవించే వాటినే 'జీవులు', 'ప్రాణులు' అంటారు. వాటిలో వున్న 'బ్రహ్మ'నే 'జీవుడు' అంటారు. అందుకే 'జీవుడే దేవుడు' అని కూడా అంటారు.

అందుకే 'జీవం' అంటే 'బ్రహ్మ' వుంటే 'శివం' అంటారు. 'జీవం' అంటే 'బ్రహ్మ' లేకపోతే 'శవం' అంటారు.

అలా పంచభూతాలు, సమస్త లోకాలు సమస్త జీవులు 'బ్రహ్మ' నుంచి ఏర్పడ్డాయి కాబట్టి, ఆయన తప్ప ఇక ఎవరూ లేరు కాబట్టి, అన్నీ ఆయనే, అంతా ఆయనే అంటారు. 'బ్రహ్మ'తప్ప అంటే భగవంతుడు తప్ప ఇంక వేరే ఏదీ లేదు, ఎవరూ లేరు అని అర్థం. అందుకే 'బ్రహ్మ'ను "సర్వవ్యాపి" అంటారు. కారణం అంతటా వ్యాపించి వున్నాడు కాబట్టి.

అంతేకాదు అన్నింటిలోనూ ఆయనే వుండి చైతన్యం కలిగించాడు కాబట్టి అంటే 'బ్రహ్మే' కాబట్టి ఆయనను 'సర్వాంతర్యామి' అంటారు. అంటే సర్వుల అంతరాలలో వ్యాపించి వున్నవాడు అని అర్థం.

అందుకే ప్రహ్లాదుడు



**"ఇందుగలడందులేడను,**
**సందేహము వలదు చక్రి సర్వోపగతుం!**
**డెందెందువెదకి చూసిన**
**నందందే గలడు దానవాగ్రణి"**

అంటే 'పరబ్రహ్మ' అంటే భగవంతుడు సర్వాంతర్యామి అని ప్రహ్లాదుడు ఎంత చక్కగా చెప్పాడో తెలుసుకోవచ్చు.



ఇదే విషయాన్ని లాహిరి మహాశయుని ఒక సందర్భంగా అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పడం జరిగింది.

ప్రశ్న: శివుడు, విష్ణువు, కాళి ఈ దేవతలలో మీరు ఎవరిని ధ్యానిస్తారు?

జవాబు: శివుడిలో, విష్ణువులో, కాళిలో నీలో నాలో అందరిలో ఉండేవాడిని ధ్యానిస్తాను.

అంతేకాదు "చాందోగ్యోపనిషత్తు"లో ఈ విషయాన్నే చెప్పడం జరిగింది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంటే సమస్తము బ్రహ్మమయమై వున్నది.



అంతేకాదు సర్వ జీవులలో తాను ఆత్మ రూపంలో వున్నానని భగవద్గీతలో శ్రీ కృష్ణ భగవానుడు చెప్పడం జరిగింది.

అంతటి గొప్పవాడైన బ్రహ్మ మన దేహంలోనే, అత్యంత దగ్గరగా, సన్నిహితంగా వున్నాడన్న సంగతి తెలియక ఆయన కోసం అక్కడకి, ఇక్కడికి... పుణ్యక్షేత్రాలు అంటూ... యాత్రా స్థలాలు అంటూ... కాశీ, రామేశ్వరం, జెరూసలేం, మక్కా మదీనా అంటూ తిరుగుతున్నాం.



అందుకే వీరబ్రహ్మేంద్ర స్వామి ఇలా అన్నారు.

**తీర్థ యాత్రలందు దేవుడొక్కడే గదా**
**మంచి తీర్థము (బ్రహ్మ) మన పంచె నుండె**
**దివ్య తీర్థ (బ్రహ్మ)మిదిగో దేహమందున్నది**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

తా:– ఏ తీర్థయాత్రకు వెళ్ళినా దేవుడు ఒక్కడేకదా! మంచితీర్థం మన దగ్గర అంటే 'బ్రహ్మ' మన దేహంలోనే వున్నాడు అని వీరబ్రహ్మేంద్రస్వామి కూడా చెప్పడం జరిగింది.

'బ్రహ్మ'ను గురించి తెలుసుకున్నాం. ఇక 'బ్రహ్మ'ను పొందే మార్గం. తెలుసుకుందాం.

# "బ్రహ్మ విద్య"

బ్రహ్మను పొందే మార్గం అంటే **'బ్రహ్మవిద్య'** గురించి తెలుసుకుందాం.

జనులు ఏ విద్యను తెలుసుకొంటే సమస్త విద్యలను తెలుసుకున్న వారవుతారో ఆ విద్యే **"బ్రహ్మవిద్య".**

అలాగే ఏ విద్య నేర్చుకుంటే చావు వుండదో ఆ విద్యనే 'బ్రహ్మవిద్య' అంటారు. అందరూ ఆ విద్యనే నేర్చుకోవాలి.

నారదుడు 64 కళలను అభ్యసించినా, అశాంతి తొలగలేదు. అపుడు సనత్‌కుమారుని దగ్గరకు వెళ్ళి ప్రార్థించగా అపుడు సనత్ కుమారుడు 'ఆత్మవిద్య'ను అంటే 'బ్రహ్మ విద్య'ను బోధించడం జరిగింది.

కఠోపనిషత్తులో యముడు నచికేతునకు ఈ 'బ్రహ్మ విద్య'ను బోధించడానికి ఎంతో సంశయించాడు, ఎంతో ఆలోచించాడు.



కారణం 'బ్రహ్మవిద్య' యోగ్యత గల వారికే చెప్పాలని, అర్హత లేని వారికి చెపితే  అది వంటపట్టకపోగా శుష్క వేదాంతమై తనకు, సమాజ చెడుకు హేతువవుతుందని యమ ధర్మరాజు ముందు ఎంతో సంశయించాడు.

కానీ నచికేతుడు బ్రహ్మవిద్యను తెలుసుకోవాలనే పట్టువదలక పోవడంతో యమ ధర్మరాజు చివరకు బ్రహ్మ విద్యను ఈ విధంగా బోధించారు.

నచికేతా! బ్రహ్మం హేతువాదానికి అందనిది, ఈ 'బ్రహ్మ' నిగూఢం. బ్రహ్మతత్వాన్ని అంటే 'ఆత్మ తత్వాన్ని' గూర్చి వినటానికి మానవులలో చాలా మంది నోచుకోరు. చాలా మంది వినాలనుకున్నా ఈ 'బ్రహ్మ తత్వాన్ని' చెప్పేవాడు దొరకడం కూడా కష్టమే. ఒకవేళ ఉపదేశించేవాడు–చెప్పేవాడు లభించినా, ఆ ఉపదేశాన్ని గ్రహించి మననం చేసేవాళ్ళు, ఆచరణలో పెట్టే వాళ్ళు చాలా అరుదు. అంతేకాదు యోగులచే అనేక విధాలుగా ఆలోచింప దగ్గదైన ఈ 'బ్రహ్మతత్వం' ప్రాకృత బుద్ధి గల వాడు ఉపదేశించలేరు. ఒకవేళ అలాంటి వాళ్ళు, ఉపదేశించినా విన్నవాడు దానిని తెలుసుకోలేడు అని యమధర్మరాజు చెప్పడం జరిగింది.

ఆయన ఇంకా 'బ్రహ్మ' దర్శనం అంటే 'ఆత్మ' దర్శనం చాలా కష్ట సాధ్యమని, ఎల్లప్పుడూ ధ్యానం చేసే ధీరుడు బాహ్యా విషయాల నుండి ఇంద్రియాలను మరల్చి చిత్తాన్ని అంటే మనస్సును 'ఆత్మ'లో నిలిపినవాడు మాత్రమే 'ఆ పరమాత్మ'ను అంటే 'బ్రహ్మ'ను తెలుసుకోగలడని అలాంటి వాడు హర్ష, శోకాలను రెండింటిని విడుస్తాడని యమధర్మరాజు నచికేతునకు చెప్పడం జరిగింది.

ఆయన ఇంకా "ఋగ్వేదాదులన్నీ ఏ పరమపదాన్ని పొందదగినదిగా భోధిస్తున్నాయో, దేన్ని పొందటానికి తపస్సులు చేయబడుతున్నాయో, దేన్ని కోరి నైష్ఠిక బ్రహ్మచర్యం పాటించబడుతుందో, ఆ పరమార్థమే నాశనం లేని 'పరబ్రహ్మం' అని చెప్పడం జరిగింది.

ఆయన ఇంకా 'సృష్టి మొదలైన నాటి నుండి 'బ్రహ్మ' అంటే 'ఆత్మ'

మనస్సు, ఇంద్రియాల ద్వారా బాహ్య వస్తువుల పరిచయాన్ని పొందుతూ వుంది. 'ధ్యానం' ద్వారా అంతర్ముఖుడైన వాడు జాగ్రదవస్థలో, స్వప్నావస్థలో సాక్షిగా అన్నింటిని చూడగలడు. తనకు తాను తెలుసుకోగలడు. అలా 'ఆత్మతత్వం' బోధపడినవాడు సర్వదుఃఖాల నుండి విముక్తి పొంది ఆనందానుభూతిని పొందుతాడని యమధర్మరాజు చెప్పడం జరిగింది.

"ఓ నచికేతా! కుటిల చిత్తం లేని, జనన, మరణాది వికారాలు లేని 'పరబ్రహ్మ'కు దశ ద్వారాలతో కూడిన ఈ దేహమే పట్టణం. అందుండు 'పరబ్రహ్మ'ను రాగద్వేషాలు లేక 'ధ్యానించేవాడు' జనన మరణ రూపమైన సంసార బంధాల్నుండి విముక్తుడవుతున్నాడు అని చెపుతూ..

ఏ 'ఆత్మ' ఈ దేహాన్ని విడవటం వలన ఈ దేహం ఏమీ లేకుండా నశించి పోతుందో అదే 'పరబ్రహ్మ స్వరూపం'. ఈ సూర్యచంద్రాదులు 'పరబ్రహ్మ'ను ప్రకాశింపచేయలేవు. ఈ సూర్య, చంద్ర, నక్షత్రాదులన్నీ ఆ 'పరబ్రహ్మ' ప్రకాశం చేతనే ప్రకాశిస్తున్నాయి అని అంటూ...

ఓ నచికేతా! జనులు మరణాన్ని పొంది వారి వారి కర్మ, జ్ఞానాల ప్రకారం దేహాన్ని పొందుతున్నారు. నిద్రించి వున్న సర్వజీవులలో ఏ పురుషుడు మేలుకుని వున్నాడో అదే నాశరహితమైన, పరిశుద్ధమైన 'బ్రహ్మ'. ఆ పరమాత్మలోనే సమస్త లోకాలు ఆశ్రయించి వున్నాయని యమ ధర్మరాజు చెపుతూ నచికేతా! 'బ్రహ్మ'ను పొందే మార్గం మంగలికత్తి అంచు మీద నడక లాంటిది. అందుచేత శ్రేష్టులయిన గురువులను చేరి 'బ్రహ్మ' తత్వాన్ని తెలుసుకోవాలని బోధించాడు.

అటువంటి 'బ్రహ్మవిద్య' అంటే 'బ్రహ్మజ్ఞానం' ఇప్పుడు బ్రహ్మర్షిలైన 'పత్రీజీ' అందరికీ బోధిస్తున్నారు. అందుచేత ఆ "బ్రహ్మజ్ఞానం"ను పొందే 'బ్రహ్మ విద్య'ను మనం కూడా తెలుసుకుందాం.

ఈ 'బ్రహ్మజ్ఞానం' పొందాలంటే ఏడు స్థితులు వున్నాయని పెద్దలు చెప్పడం జరిగింది. వీటినే సప్తజ్ఞాన భూమికలు అంటారు.

అవేమిటంటే (1) శుభేచ్ఛ, (2) విచారణ, (3) తనుమానసం, (4) సత్వాపత్తి, (5) అసంసక్తి, (6) పదార్థ భావన, (7) తురీయం.

**(1) శుభేచ్ఛ:-**

నాకు 'బ్రహ్మ జ్ఞానం' కావాలి అన్న ఇచ్ఛ అంటే కోరిక. అంతేకాదు నేను శాశ్వత దుఃఖరాహిత్య పదవి పొందాలి అన్న తీవ్ర ఆకాంక్ష అంటే నేను దుఃఖం నుండి అంటే ఈ సమస్యలు, బాధలు, రోగాలు, కష్టాల నుండి శాశ్వతంగా బయటపడాలి అనే తీవ్ర తపన వుండటమే శుభేచ్ఛ అంటారు.

**(2) విచారణ :-**

శుభేచ్ఛ కలిగిన వారు సహజంగా ఈ 'బ్రహ్మజ్ఞానాన్ని' ఏ విధంగా పొందాలి? ఎవరిని ఆశ్రయించాలి? అని ఆలోచిస్తారు. ఆ ప్రయత్నం చేస్తారు. గురువులను ఆశ్రయిస్తారు. అలా చేయడాన్ని విచారణ అంటారు. అపుడు వారికి ఆ గురువులు బ్రహ్మజ్ఞానాన్ని పొందాలంటే ఆధ్యాత్మిక త్రిరత్నాలైన (1) ధ్యానం, (2) స్వాధ్యాయం, (3) సజ్జన సాంగత్యాలను బోధిస్తారు.

**(3) తనుమానసం :-**

అలా ధ్యాన సాధనా మార్గం తెలుసుకున్నాక ఆ తపనతో నిత్యం తీవ్ర సాధన చేస్తూ ఆత్మజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు చదువుతూ ఆత్మ జ్ఞానాన్ని బోధించగలిగే వారితో సాంగత్యం చేస్తూ ఏ రోజూ విఘ్నం లేకుండా ఆచరించడమే తనుమానసం.

**(4) సత్వాపత్తి :-**

ధ్యాన సాధన చేస్తూ, సాత్వికమైన శాకాహారం తీసుకుంటూ శుద్ధ సాత్విక స్థితి సాధించడమే సత్వాపత్తి! అంటే ధ్యానం ద్వారా తమోగుణం, రజో గుణం అన్నవి పూర్తిగా శూన్యమైన స్థితి. అపుడు ఇక మిగిలింది శుద్ధ సాత్వికమే.

తమోగుణం అంటే సోమరితనం, రజోగుణం అంటే నాకు తెలుసు అనే గర్వం. అధికార దర్పం ఇవి తొలగిన స్థితి.

ఈ నాల్గవ జ్ఞాన భూమికలో "ధ్యాన,స్వాధ్యాయ, సజ్జన సాంగత్యాదులు"

తీవ్ర స్థాయికి చేరుకున్న స్థితి. ఆ తీవ్రత ద్వారా నాడీ మండలం పూర్తిగా శుద్ధమవుతుంది. మనస్సు పూర్తిగా కంట్రోలు అవుతుంది. దీనినే యోగి అయిన స్థితి అనవచ్చు.

అంతేకాదు "అహం బ్రహ్మాస్మి" అని చక్కగా సిద్ధాంత పరంగా తెలుసుకుంటారు. 'బ్రహ్మవిదుడు' అయిన స్థితి అనవచ్చు.

**(5) అసంసక్తి :-**

అలా సాధన కొనసాగుతుంటే మెల్లిగా దివ్య చక్షువు ఉత్తేజితమవుతుంది. తనువు, మరి సంసారం రెండూ తాత్కాలికమైనవే అని సంపూర్ణంగా తెలుసుకుంటారు. అపుడు ఆ రెండింటి మీద పూర్తిగా అనాసక్తి కలుగుతుంది. ఆ స్థితినే అసంసక్తి అంటారు.

అపుడు తామరాకు మీద నీటి బొట్టులా వుంటారు. వారికి సంసారంలో అనాసక్తి వున్నా ధర్మనిష్ట, కర్మనిష్ట వుంటాయి. అంటే తనువు పట్ల, మరి సంసారం పట్ల తటస్థ దృష్టి కలిగి వుంటారు.

వారికి దివ్యచక్షువు ఉత్తేజితమవుతుంది. సత్యద్రష్ట అవుతారు. అపుడు పూర్తిగా దాని మీదనే ఆసక్తిని, ఏకాగ్రతనూ నిలుపుతారు. దీనినే అసంసక్తి అంటారు. అపుడు వారిని "బ్రహ్మ విద్వరుడు" అంటారు.

**(6) పదార్థ భావన :-**

ఈ స్థితిలో దివ్య చక్షువును క్షుణ్ణంగా ఉపయోగించుకోగలుగుతారు. అలాగే ప్రతి పదం యొక్క అర్ధంతో, ప్రతి వస్తువు యొక్క భావంలో ప్రత్యక్షంగా వుండగలుగుతారు. అంటే బ్రహ్మ విద్వరీయుడు అయిన స్థితి అని అంటారు. దీనినే సిద్ధ స్థితి, సవికల్పసమాధి స్థితి అని కూడా అంటారు. అంటే ఎన్నో సమాధానాలు దొరికినా ఇంకా కొద్దిగా సంశయాలు వున్న స్థితి.

**(7) తురీయం :-**

ఇది మానవుని యొక్క పూర్ణ వికాస స్థితి. సిద్ధుడు బుద్ధుడు అయిన స్థితి. అందరినీ యోగులుగా, సిద్ధులుగా, బుద్ధులుగా మలచడానికి కంకణం

కట్టుకుని ఆ పరిక్రమలో పూర్తిగా నిమగ్నమై వున్న వాళ్ళనే బుద్ధుడు అంటారు. దీనినే 'సహస్రదళకమలం' అంటారు. ఇదే 'వేయి పడగల పాము' అని కూడా అంటారు.

ఇలాంటి వారు ఒక్కొక్క మనిషిని యోగిగా మలచినపుడు సహస్ర దళ కమలంలో ఒక్కొక్క రేకు విచ్చుకుంటుంది. ఇటువంటి వారిని 'బ్రహ్మవిద్వరిష్టుడు' అంటారు.

తురీయం అంటే సర్వ సామాన్యమైన జాగృత, స్వప్న, సుషుప్తి స్థితులను దాటిన వాడు అని అర్థం.తురీయం అంటే మూడింటిని దాటిన స్థితి అని అర్థం. అంటే నిర్వికల్ప సమాధి స్థితికి చేరుకున్న స్థితి. సమాధి అంటే సమాధానాలు తెలుసుకున్న స్థితి. 'నిర్వికల్ప సమాధి' అంటే ఏ సందేహాలు, సంశయాలు లేని స్థితి.

అటువంటి వారినే 'బ్రహ్మజ్ఞాని' అంటారు.

కానీ ఈ స్థితికి చేరుకుని, ఆ జ్ఞానం పొందటం అంత తేలికైన విషయమేమీ కాదు. చాలా కష్టపడాలి. చాలా కృషి చెయ్యాలి. చాలా సాధన చెయ్యాలి.

అందుకే 'బ్రహ్మ'ను పొందడం అంత తేలిక కాదని కఠోపనిషత్తులో కూడా చెప్పబడింది.

**"ఏష సర్వేషు భూతేషు గూఢోత్మాన ప్రకాశతే ।**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥ "**

(కఠోపనిషత్ 3-12)

"అన్ని జీవులలోనూ గుప్తమైవున్న ఈ ఆత్మ (బ్రహ్మ) అందరికీ ప్రకటితం కాదు; సూక్ష్మదర్శులైన ఋషులు మాత్రమే తీక్షణమైన, ఏకాగ్రమైన తమ బుద్ధి ద్వారా ఈ ఆత్మను (బ్రహ్మను) సాక్షాత్కరించుకోగలరు".

- రామకృష్ణ మిషన్ ప్రచురణ

అనంతశక్తివంతుడైన, మహిమాన్వితుడైన 'బ్రహ్మ' తన దేహంలో వున్నా

కూడా, తెలియక మానవుడు మనస్సును బట్టి జీవిస్తున్నాడు. అందుచేతే దుఃఖాన్ని పొందుతున్నాడు. దుఃఖ రాహిత్యాన్ని అంటే ముక్తిని పొందలేక పోతున్నాడు. అటువంటి ముక్తిని పొందాలంటే మనస్సును శూన్యం చేసుకోవాలి. మనస్సును శూన్యం చేసుకుని 'బ్రహ్మ'ను పొందితే ముక్తిని పొందినట్టే.

ఈ విషయమే యోగులంతా స్పష్టంగా చెప్పడం జరిగింది. అంటే 'బ్రహ్మ'ను పొందాలంటే మనస్సు లేకుండా చేసుకోవాలి, అంటే మనసును శూన్యం చేసుకోవాలి. అంటే అంతర్ నిశ్శబ్దం సాధించాలి, చిత్తాన్ని అంటే మనస్సును నిశ్చలం చేసుకోవాలి. అంటే చిత్తవృత్తులు నిరోధించాలి అంటే నిర్గుణుడు కావాలి అంటే మనస్సును ఆత్మలో లయం చెయ్యాలి, అంటే మనస్సు బందీలో వున్న ఇంద్రియాలను మనస్సు బందీ నుండి విడిపించాలి. అంటే దేహ భావం లేకుండా చేసుకోవాలి. అప్పుడే ఎవరైనా 'బ్రహ్మ'ను పొందగలరు. తద్వారా ఆత్మజ్ఞానాన్ని అంటే బ్రహ్మ జ్ఞానాన్ని పొందగలరు. తద్వారా కర్మలు రహితం చేసుకోగలరు. తద్వారా ముక్తిని పొందగలరని యోగులందరూ చెప్పడం జరిగింది.

'ముక్తి'ని పొందాలనుకునే వారందరికీ ఆ యోగులంతా 'బ్రహ్మ'ను పొందమనే చెప్పడం జరిగింది. వారంతా ఏమి చెప్పారో కూడా తెలుసుకుందాం.

**శృతి వాక్యం :-**

"మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షంః !! "

ದದದ

మానవుల బంధం అంటే దుఃఖానికి, మోక్షం అంటే ఆనందానికి మనసే కారణమని శృతి వాక్యాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

కారణం మనస్సే బ్రహ్మాన్ని పొందటానికి, బ్రహ్మాన్ని తెలుసుకోవటానికి ఆటంకమైంది. అందుకే మనస్సు వుంటే దుఃఖం. మనస్సును శూన్యం చేసుకుని 'బ్రహ్మ'ను పొందితే మోక్షమని శృతి వాక్యంలోని అర్థం.

మనస్సు శూన్యం కావాలంటే 'శ్వాసమీద ధ్యాస' వుంచవలసిందే! ఇదే బ్రహ్మర్షి పత్రీజీ బోధిస్తున్నారు.



**బ్రహ్మర్షి పత్రీజీ :-**

"ధ్యానం వల్ల జ్ఞానం, జ్ఞానం వల్ల ముక్తి".

ΩΩΩ

ధ్యానం అంటే "శ్వాసమీద ధ్యాస వుంచడం" ద్వారా, ఆలోచనా రహిత స్థితి అంటే మనస్సు శూన్యమైన స్థితి పొందడం ద్వారా, విశ్వంలోని ప్రాణశక్తి ఆవాహం ద్వారా, నాడీమండల శుద్ధి జరగడం ద్వారా, దివ్యచక్షువు ఉత్తేజితం చేసు కోవడం ద్వారా, ఆత్మ జ్ఞానాన్ని పొంది కర్మలు దగ్ధం చేసుకోవడం ద్వారా ముక్తి పొందవచ్చని బ్రహ్మర్షి పత్రీజీ బోధిస్తున్నారు.

**యోగానంద పరమహంస :-**



"క్రియాయోగం ద్వారా అంతర్ నిశ్శబ్దాన్ని సాధిస్తే ముక్తి పొందవచ్చు".

ΩΩΩ

క్రియ అంటే శ్వాసక్రియ, యోగం అంటే కలయిక. శ్వాసతో కలవడం అంటే 'శ్వాస మీద ధ్యాస వుంచడం' ద్వారా మనస్సు శూన్యం చేసుకొని అంతర్ నిశ్శబ్దాన్ని అంటే ఆలోచనలు లేని స్థితి పొందితే బ్రహ్మను పొందవచ్చు తద్వారా దుఃఖం నుంచి బయటపడవచ్చు. ముక్తి పొందవచ్చని యోగానంద తెలియచేశారు.



**అవతార్‌మెహర్‌బాబా :**

"The Real Things that are given & received only in Silence"

మానవునకు కావలసిన అసలైనవి అంటే శాంతి, ఆనందం, ధర్మం, ప్రేమ, కరుణ, జ్ఞానం అన్నీ నిశ్శబ్దంలోనే అంటే మనస్సు లేని బ్రహ్మ స్థితిలోనే లభిస్తాయని మెహర్‌బాబా తెలియ చేశారు.

**ఆదిశంకరాచార్య :**



**సత్సంగత్వే నిస్సంగత్వం**
**నిస్సంగత్వే నిర్మోహత్వం**
**నిర్మోహత్వే నిశ్చలచిత్తం**
**నిశ్చలచిత్తే జీవన్ముక్తి!**

ꝺꝺꝺ

నిశ్చల చిత్తం అంటే మనస్సు నిశ్చలమైనపుడు, అంటే శూన్యమైనప్పుడు ముక్తి లభిస్తుందని శంకరాచార్యుల వారి సందేశం. జీవన్ముక్తి అంటే జీవించి వుండగానే ముక్తి.

**పతంజలి మహర్షి :**



**"యోగః చిత్తవృత్తి నిరోధః"**

ꝺꝺꝺ

"చిత్తవృత్తులు నిరోధించడమే యోగం" అని పతంజలి మహర్షి తెలియచేశారు. అంటే యోగ స్థితి పొందాలంటే చిత్తంలోని వృత్తులు అంటే ఆలోచనలు నిరోధించాలి. అంటే మనస్సు శూన్యం చెయ్యాలి. దాని మార్గమే "శ్వాసమీద ధ్యాస". అలా యోగ స్థితి అంటే బ్రహ్మ స్థితి పొందితే వారు దుఃఖం నుండి బయటపడతారు.

**శ్రీకృష్ణ పరమాత్మ :-**



**1) "యోగో భవతి దుఖః"**

యోగి అయిన వాడికి అంటే బ్రహ్మానుభూతి పొందిన వాడికి దుఃఖం వుండదు.

---

**2) "త్రైగుణ్యా విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జునా"**

"అర్జునా త్రిగుణాలకు అతీతమైన నిర్గుణిడివికా!" అన్నారు శ్రీ కృష్ణ పరమాత్మ. మనస్సు శూన్యం చేసుకుంటే నిర్గుణి కావచ్చు. సత్వ, రజ, తమోగుణాలకు అతీతుడవ్వచ్చు. ఆ మార్గమే "శ్వాస మీద ధ్యాస ధ్యానం"

---



**శ్రీ వీర బ్రహ్మేంద్రస్వామి :-**

**స్నానమందు లేదు, పానమందు లేదు**
**మంత్రతంత్రములందు మహిమ లేదు**
**మనసు కుదిరెనేని ఘనయోగి తానౌను**
**కాళికాంబ హంసకాళికాంబ!**

ꝺꝺꝺ

నదీ స్నానాలు, సముద్ర స్నానాలలో ఏమీ లేదు, ఆలయాలలో తీసుకునే తీర్థం, గంగా తీర్థం పానం చేసినా ఫలితం ఉండదు. మంత్ర తంత్రాలలో కూడా ఏమీ లేదు. మనసును ధ్యానంలో నిర్గుణ స్థితికి చేర్చగలిగితేనే యోగి కాగలడు. బ్రహ్మ స్థితి పొందగలడు. దుఃఖం నుంచి బయట పడగలడు. అదే ముక్తి.

**రమణ మహర్షి :-**



**"మనస్సును ఆత్మలో లయం చెయ్యాలి"**

 దదద

అంటే మనస్సు శూన్య స్థితికి చేరితే ఆత్మలో అంటే బ్రహ్మలో లయమైనట్టే అదే ముక్త స్థితి. "శ్వాసమీద ధ్యాస" ద్వారా తేలికగా సాధించవచ్చు. దుఃఖం నుండి బయటపడవచ్చు.

**కల్కి భగవాన్ :-**



**"మనస్సు బందీలో వున్న ఇంద్రియాలను మనస్సు బందీ నుండి విడిపించడమే ముక్తి"**

దదద

మానవుని జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు మనస్సు ఎలా చెప్తే అలా పనిచేస్తాయి. అందుచేత అవి మనస్సు బందీలో వున్నట్టే. అలా మనస్సు బందీలో ఇంద్రియాలు వుంటే మానవ జీవితం దుఃఖమయమవుతుంది. అందుచేత వాటిని మనస్సు యొక్క బంధం నుండి విడిపించాలి. మనస్సు ఉంటే ఇంద్రియాలు మనస్సు బందీలో వున్నట్లే. మనస్సును శూన్యం చేస్తే ఇంద్రియాలకు స్వేచ్ఛ లభిస్తుంది. మానవునకు దుఃఖం నుండి విముక్తి లభిస్తుంది.

మనస్సును శూన్యం చేసే మార్గమే 'శ్వాస మీద ధ్యాస' ధ్యానం.

**సత్యసాయిబాబా :-**



**"దేహభావం వదిలితేనే దైవభావం కలుగుతుంది"**

దదద

మానవునకు దేహభావం వున్నంత వరకు అన్ని రకాల దుఃఖాలు తప్పవు. దేహభావానికి కారణం మనస్సు. మనస్సును శూన్యం చేస్తే వెంటనే దైవభావం అంటే 'బ్రహ్మ'భావం కలుగుతుంది. దుఃఖం నుంచి విముక్తులవుతారు. ఆనందంగా వుంటారు. దాని మార్గమే "శ్వాసమీద ధ్యాస" ధ్యానం.

## జీసస్ క్రైస్ట్ :-



"For Forty days and Forty nights he ate nothing!"

"నలభై రోజులు జీసస్ ఏమీ తినలేదు", అంటే మనసుతో తినకుండా అంటే ఆలోచించకుండా, చిత్తవృత్తులు నిరోధించి, అంతర్ నిశబ్దంతో 40 రోజుల ధ్యాన ముద్రలో ఉండి, దివ్యత్వాన్ని అంటే బ్రహ్మత్వాన్ని పొందారు. నిర్వికల్ప సమాధి పొందారు.

## గౌతమ బుద్ధుడు:-



మానవుడు "నిర్వాణాన్ని" అంటే సమస్త దుఃఖాల నుండి శాశ్వతంగా బయట పడాలంటే "ఆనాపానసతి" ధ్యానం చెయ్యాలని బోధించారు. "ఆనాపానసతి' అంటే శ్వాస మీద ధ్యాస' ఉంచడం ద్వారా, చిత్త వృత్తి నిరోధం ద్వారా, విశ్వశక్తి ఆవాహం ద్వారా, కర్మ రహితం ద్వారా... బ్రహ్మ సాక్షాత్కారం ద్వారా సమస్త దుఃఖాల నుండి బయట పడవచ్చుని భోధించారు.

## బ్రహ్మర్షి పత్రీజీ:-

"ఆధ్యాత్మిక శాస్త్ర విజ్ఞాన అనుభవ ప్రకారంగా ఒక గురువు చెప్పింది మరొక గురువు చెప్పిన దాని కన్నా విభిన్నంగా ఎప్పుడూ వుండజాలదు. ఏ లోకంలోనైనా ఏ కాలంలోనైనా, "శాస్త్రజ్ఞానం" అన్నది ఒక్కటిగానే వుంటుంది. "ఏకం సత్"! అన్నారు కదా?".

అందుచేత దుఃఖ నివారణకు యోగులందరూ చెప్పింది ఒక్కటేనని తెలుసుకోవాలి. వారంతా చూపింది ఒక్కటే మార్గం అదే "సత్యమార్గం" అంటే 'బ్రహ్మ మార్గం' అని తెలుసుకుని "శ్వాస మీద ధ్యాస" ఉంచి ధ్యానం చేస్తే తాత్కాలికంగానే కాదు, శాశ్వతంగా దుఃఖం నుంచి బయటపడవచ్చు.

యోగులు చెప్పిన పై విషయాలు గమనిస్తే మానవుని దుఃఖాలకు కారణం మనస్సులోనే వుందని తెలుస్తుంది. మనస్సు వుంటే దుఃఖం, మనస్సును జయించి శూన్యం చేసుకుని ఆత్మ స్థితి అంటే బ్రహ్మస్థితి పొందితే ముక్తి అని తెలుస్తుంది.

అలా విశేషమైన ధ్యానం చెయ్యడం ద్వారా 'జ్ఞాననేత్రం' సంపాదించుకోవచ్చు. బ్రహ్మానుభూతి పొందవచ్చు. అందుచేత పరమేశ్వరుడు బోధించిన ప్రకారం నామ, రూపాలను వదలి బ్రహ్మర్షి పత్రీజీ బోధించే "శ్వాస మీద ధ్యాస" 'ధ్యానం' ద్వారా, జీవితాన్ని ధన్యం చేసుకోవాలి.

ఇప్పటి వరకు మనం బ్రహ్మను పొందే మార్గం తెలుసుకున్నాం. కానీ ఈ మార్గం ద్వారా బ్రహ్మను పొందితే పొందే ఫలితాలు కూడా తెలుసుకుందాం.

# "బ్రహ్మను పొందితే కలిగే లాభాలు"

**"క్షియన్తే చాప్య కర్మాణి అస్మిన్ దృష్టా పరావరే!"**

తా:- 'బ్రహ్మ' అంటే 'ఆత్మ' సాక్షాత్కారము పొందిన ఉపాసకుని, సాధకుని ఆగామి, సంచిత, ప్రారబ్ద కర్మలు నశిస్తాయి.

అంతేకాదు ధ్యానం ద్వారా బ్రహ్మను పొందే ప్రయత్నం చేస్తేనే చాలు పొందే గొప్ప ఫలితాలు ఉత్తర గీతలో శ్రీ కృష్ణ భగవానుడు చెప్పడం జరిగింది.

**శ్లో॥ నిమిషం నిమిషార్థం వాజ్ఞానినో ధ్యాన చింతియా!**
**క్రతుకోటి సహస్రాణం ధ్యానమేకం విశిష్ఠతే ॥**

తా:- ఒక నిమిషం కానీ, నిమిషమున్నర కానీ ధ్యానంలో బ్రహ్మ మీద దృష్టి వుంచిన వారికి వేయి కోట్లు క్రతువులు (యాగములు) చేసిన ఫలితం కలుగుతుందని చెప్పడం జరిగింది.

అంటే ధ్యానంలో మనస్సును అధిగమించి 'ఆత్మ' మీద అంటే 'బ్రహ్మ' మీద దృష్టి వుంచిన వారికి ఎంత గొప్ప ఫలితం కలుగుతుందో పై శ్లోకం ద్వారా చెప్పబడింది.

అందుచేత ధ్యానం చేసే ధ్యాన యోగులు ఎంత గొప్పవారో అర్థం చేసుకోవచ్చు. ఈ విషయమే భగవద్గీతలో కూడా చెప్పబడింది.

కానీ కృష్ణుడంతటి గొప్పవాడు చెప్పింది ఎంత గొప్పదై వుంటుంది? అది ఆచరించినవాడు ఎంతటి గొప్పవాడవుతాడు? ఎన్ని గొప్ప లాభాలు పొందగలుగుతాడో! ఈ క్రింది శ్లోకాల ద్వారా చూద్దాం. అసలు గీతలో శ్రీ కృష్ణుల వారు అర్జునుని ఏమి అవ్వమని చెప్పారో చూద్దాం.

**శ్లో॥ తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున (భ.గీ.6-46)**

తా:- ఓ అర్జునా! యోగి అనువాడు తపస్సులు చేసే వారి కంటే, శాస్త్ర జ్ఞానము కలవారి కంటే, అగ్నిహోత్రాది కర్మలు చేసేవారి కంటే శ్రేష్టుడు. కావున నీవు యోగివి కమ్ము.

పై శ్లోకం ద్వారా తపస్సు చేసేవారు అంటే శరీరాన్ని తపింపచేసుకునే వారు అంటే ఎండలో నుంచోవడం, ఒంటికాలిపై నిలబడడం, రెండు చేతులు పైకి ఎత్తడం, హఠయోగం ద్వారా కఠినమైన భంగిమలు వేయడం, అన్నపానీయాలు మానడం (ఉపవాసం) లాంటివి చేసి శరీరాన్ని శుష్కింప చేసుకునే వారి కంటే యోగి గొప్పవాడు అని తెలుసుకోవచ్చు.

అలాగే శాస్త్ర జ్ఞానము కలవారు అంటే పుస్తకజ్ఞానం, పండిత జ్ఞానం అంటే పుస్తకాలు చూసి అనర్గళంగా ఉపన్యాసాలు చెప్పే పండితులకంటే! శాస్త్రాలను అధ్యయనం చేసే వారికంటే! కూడా యోగి గొప్పవాడు అని తెలుసుకోవాలి.

అలాగే కర్మలు చేసేవారు అంటే నిత్య నైమిత్తిక కర్మలు అంటే సంధ్యా వందనం, సూర్య నమస్కారాలు, గాయత్రి మంత్రం లాంటి నిత్య అనుష్ఠానాలు. అలాగే యజ్ఞ, యాగాది కర్మలు చేసే వారి కంటే 'యోగం' చేసే 'యోగి' గొప్పవాడు. అందుచేత అర్జునా యోగివి కా! అని భగవానుడు చెప్పడం జరిగింది. మరి ఎవరు యోగి? దేనిని యోగమంటారు?

యోగ శాస్త్రానికి మూలపురుషుడైన "పతంజలి మహర్షి" "యోగః చిత్తవృత్తి నిరోధః" అని యోగానికి నిర్వచనం ఇచ్చారు. అంటే చిత్త వృత్తులు నిరోధించడమే యోగమనబడుతుంది. చిత్త వృత్తులు అంటే చిత్తము యొక్క వృత్తులు. చిత్తము అంటే మనస్సు. మనస్సు యొక్క వృత్తులు అంటే ఆలోచనలు. అంటే మనస్సులోని ఆలోచనలు నిరోధించడమే యోగము. అంటే ఆలోచనలు లేని స్థితిలో వుండడమే 'యోగ'మంటారు. ఆ స్థితిలో వున్నవాడే 'యోగి' అని పిలువబడతాడు.

అలా ఆలోచనలు లేని 'యోగ స్థితి'లో వుండటానికి, అలాంటి స్థితి సాధించడానికి బ్రహ్మర్షి పత్రీజీ తేలికైన, సులువైన మార్గం 'శ్వాస మీద ధ్యాస ధ్యానం' మనకు అందించారు. ఎవరైనా సరే శ్వాస మీద ధ్యాస వుంచి ధ్యానం చేస్తే వారు తొందరగా చిత్తవృత్తులు నిరోధించుకుని, మనస్సులేని స్థితిలో

అంటే 'ఆత్మ స్థితి'లో వుంటారు. అలా ఆత్మతో కూడి వుండడమే 'యోగ' మనబడుతుంది. 'ఆత్మ' అంటే 'బ్రహ్మే' కదా? అంటే 'భగవంతుడే' కదా? అంటే భగవంతునితోకూడి వుండడమే 'యోగము' అవుతుంది. అలా వున్నవాడే 'యోగి' అనబడతాడు.

అందుచేత భగవంతుని నోటితో ప్రార్థించే వారి కంటే, ఆయన నామాన్ని మనస్సులో స్మరించే వారికంటే, కోరికలతో ఆయన గురించి ప్రార్థన చేసే వారి కంటే, ఆయన గురించి చెప్పే వారి కంటే, యజ్ఞయాగాది కర్మలు చేసే వారి కంటే, మనస్సు లేని స్థితిలో భగవంతునితో వుండే యోగి చాలా చాలా గొప్పవాడని భగవానుడు చెప్పడం జరిగింది.

**శ్లో॥ యోన్తః సుఖో న్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః**
**సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోధిగచ్ఛతి (భ.గీ.5-24)**

తా:- ఎవడు తనలోని ఆత్మతో సుఖిస్తూ, ఆత్మతో క్రీడిస్తూ, ఆత్మయందే వుంటాడో! అట్టి యోగి బ్రహ్మస్వరూపుడై బ్రహ్మ సాక్షాత్కారమును పొందును.

అంటే 'ధ్యానం' ద్వారా ఎవరవుతే మనస్సు లేని స్థితిలో 'ఆత్మ'తో అంటే 'భగవంతుని'తో వుంటారో వారు చివరకు భగవంతుని పొందుతారు. అంటే మోక్షాన్ని పొందుతారని ఈ శ్లోకం ద్వారా భగవానుడు చెప్పడం జరిగింది. అంటే ధ్యానం చేసే వారే భగవానుని పొందగలరు. కానీ ఇంక ఏ సాధన చేసినా భగవానుని పొందలేరు. అందుచేత అన్నిరకాల సాధనలు చేసే వారికంటే ధ్యాన యోగి అంటే ధ్యానం చేసే వారే గొప్పవారని భగవానుడు చెప్పడం జరిగింది.

'ధ్యానం' గొప్పది కాబట్టి, 'ధ్యానం' ద్వారా మోక్షాన్ని పొందవచ్చు కాబట్టి, అందరినీ 'ధ్యాన యోగి' కమ్మని భగవానుడు చెప్పాడు. అంతేకానీ బిర్లా అవ్వమని, అంబానీ అవ్వమని, పదవులు సంపాదించమని ఎక్కడా చెప్పలేదు. ఇది ప్రతి ఒక్కరూ అర్థం చేసుకోవాలి.

అంతేకాదు అలా యోగి అవ్వటానికి ధ్యాన సాధన ద్వారా ప్రయత్నించి

నవారు యోగి కాలేకపోయినా, ఎలాంటి లాభాలు పొందగలరో! అంతేకాదు ధ్యానం చేస్తే ఎలాంటి లాభాలు భవిష్యత్తులో కలుగుతాయో! కూడా భగవానుడు చెప్పడం జరిగింది. ఎందుచేతనంటే ధ్యానంలో ఆలోచనలు లేని స్థితి, అంటే మనస్సును నిగ్రహించగలిగిన స్థితి, శూన్యం చేసుకోగలిగిన స్థితి సాధించడం చాలా కష్టం. ఇదే విషయం అర్జునుడు భగవానుని అడుగగా! అంటే అలా నేను అనుకున్నది సాధించలేకపోతే అంటే 'ధ్యానం' ప్రారంభించి ఆత్మను పొందలేకపోతే నా పరిస్థితి ఏమిటి? ఏమీ చేయక పోవడం వల్ల ఇహంలోనూ, సాధన పూర్తి చేయలేకపోవడం వల్ల పరంలోనూ నష్టపోయి, చివరకు రెంటికీ చెడిన రేవడి అయిపోనా అని అర్జునునకు సందేహం కలిగింది. ఈ విషయాన్నే ఈ క్రింది శ్లోకం ద్వారా అర్జునుడు శ్రీ కృష్ణుడిని అడగడం జరిగింది.

**శ్లో॥ కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి**
**అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. (భ.గీ.6-38)**

తా:- ఓ కృష్ణా! బ్రహ్మమార్గంలో (యోగమార్గంలో) స్థిరము లేని మూఢుడు ఇహపరముల రెండింటికీ చెడినవాడై చెదిరిన మేఘము వలె నశించిపోడా? ఏమి?

అంటే ఇహంలో ధన సంపాదన మాని ధ్యానం చేస్తూ కూర్చుంటే ఇహలోకంలో పొందే సుఖాలు పొందలేక! అలాగే యోగసాధన పూర్తి చేయకపోవడం వల్ల పరంలో పొందే లాభాలు అంటే మోక్షం పొందలేక! రెంటికీ చెడిన రేవడిని అవుతానా? అనే సందేహాన్ని అర్జునుడు వ్యక్తం చేసాడు. అంటే ధ్యానాన్ని పూర్తి చేయకుండా అంటే యోగాభ్యాసం చేస్తూ మధ్యలో శరీరం వదిలిన వారి పరిస్థితి ఏమిటి? అని శ్రీ కృష్ణ భగవానుని ప్రశ్నించడం జరిగింది. దానికి భగవానుడు

**శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే (భ.గీ.6-41)**

తా:- అట్టి యోగభ్రష్టుడు (మరణానంతరము) పుణ్యాత్ముల లోకమును

పొంది, అచట అనేక సంవత్సరములు నివసించి, తదుపరి సదాచారవంతులైన శ్రీమంతుని యొక్క గృహమందు పుట్టుచున్నాడు.

**శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్**
**ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ (భ.గీ.6-42)**

తా:- లేక జ్ఞానవంతులగు యోగుల యొక్క వంశమందు జన్మించు చున్నాడు. అలాంటి జన్మ లభించడం లోకంలో మహా దుర్లభము.

ఇక్కడ మనం కొంచెం ఆలోచించాలి. ధ్యానం చేసేవారికి సామాన్యంగా ఏ లాభాలు పైకి కనిపించవు. వారికి ధన సంపాదన ఎక్కువ వుండదు. అంతేకాదు సాధారణంగా ధనం తక్కువ వున్నవారే ధ్యానం చేస్తూ వుంటారు. వారిని చూసి మిగతా వారు ఏమిటి? వీళ్ళు ఏమీ చేయకుండా! ఏమీ సంపాదించకుండా! ఏమీ అనుభవించకుండా! అలా ఎప్పుడూ ధ్యానం చేస్తూ కూర్చుంటారు. చాలా తెలివి తక్కువ వారిలా వున్నారే! అని ధ్యానం చేసే వారిని చూసి చాలా మంది అనుకుంటూ వుంటారు. అనే వారు కూడావున్నారు.

కానీ ధ్యానం చేసే వారు ఎంత గొప్పవారో! వారు పరంలో ఎంతటి గొప్ప లోకాలకు చేరుకుంటారో! మరలా వారికి ఎంత ఉన్నతమైన జన్మ లభిస్తుందో! పై శ్లోకాల ద్వారా భగవానుడు తెలియచేయడం జరిగింది. ఆయన చెప్పిన ప్రకారం మరుజన్మలో అప్రయత్నంగానే శ్రీమంతుల ఇళ్ళలో జన్మిస్తారని, గొప్ప జ్ఞానవంతులగు యోగుల ఇళ్ళలో జన్మిస్తారని, అలాంటి జన్మ లభించడం మహా దుర్లభమని ఆయన చెప్పడం జరిగింది. అందుకే ఆయన అందరికంటే 'యోగి' గొప్పవాడని చెప్పడం జరిగింది. ఆఖరుకు యజ్ఞ, యాగాది కర్మలు చేసే వారి కంటే 'యోగి' గొప్పవాడని చెప్పడానికి కారణం ఇదే.

దీనిని బట్టి 'ధ్యానం' చేసే 'యోగి' ఎంత గొప్పవాడో! ఎంత అదృష్ట వంతుడో! అర్థం చేసుకోవచ్చు. ప్రస్తుతం ధ్యానం చేసే వారు సామాన్యంగా కనిపించవచ్చు. లోకం దృష్టిలో సామాన్యులు కావచ్చు. కానీ అందరికంటే వారే గొప్పవారని భగవానుడు చెప్పిన దానిని బట్టి అర్థం చేసుకోవచ్చు. ప్రస్తుతం

కొంతమంది ధనవంతులుగా వుండవచ్చు. కానీ ఆ ధనం చనిపోయిన తరువాత పరానికి కానీ, మరుజన్మకు కానీ తీసుకు వెళ్ళలేరు. అంతేకాదు వారి మరుజన్మ ఎలా వుంటుందో కూడా తెలియదు. కాని ధ్యానం చేసిన వారు పరంలో పుణ్య లోకాలు పొందడమే కాదు, మరు జన్మలో శ్రీమంతులుగా కాని, గొప్ప యోగులు గా కాని జన్మిస్తారని, అంతేకాదు అలాంటి జన్మలు పొంది వారు తదనంతర సాధన పూర్తి చేసుకుని మోక్షాన్ని కూడా పొందుతారని భగవానుడు చెప్పారు. ఈక్రింది శ్లోకం చూద్దాం:-

**శ్లో|| ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః**
**అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ (భ.గీ.6-45)**

తా:- అలా ప్రయత్నించునట్టి యోగి పాపరహితుడై, అనేక జన్మములందు చేయబడిన అభ్యాసముచే యోగ సిద్ధిని పొంది ఆ పిదప సర్వోత్తమమగు మోక్షమును పొందుచున్నాడు.

అలా ధ్యానం చేసే యోగి గొప్ప జన్మలు పొందడమే గాక, చివరకు మోక్షాన్ని కూడా పొందగలరు కాబట్టి. అర్జునుని 'యోగివికా!' అని భగవానుడు చెప్పడం జరిగింది.

అర్జునునకు చెప్పాడు అంటే మనందరికీ చెప్పినట్టే! అందుచేత బిర్లాలు, టాటాలు, అంబానీలు అవ్వాలనే ప్రయత్నం మాని భగవానుడు చెప్పినట్టు 'యోగి' కావడానికి ప్రయత్నించాలి. 'ధ్యానం' చెయ్యాలి. 'ధ్యానం' చెయ్యడం కంటే మానవుడు చెయ్యగలిగిన గొప్పపని ఈ భూలోకంలో ఇంకొకటి లేదని తెలుసుకోవాలి. అదే భగవానుడు చెప్పిన సందేశం.

మనం ఇంకొకటి గుర్తుంచుకోవాలి. మనం ఎంత ప్రయత్నించినా బిర్లాలు, టాటాలు, అంబానీలు కాలేము. కారణం దానికి అర్హత వుండాలి. కానీ ధ్యానం చేస్తే యోగులుగా అవ్వగలం. అలా యోగులయ్యే అర్హత, ధ్యానం చెయ్యగల శక్తి, ప్రతీ ఒక్కరికి వుంది. అందుచేత అందరూ ధ్యానం చెయ్యండి. భగవానుడు చెప్పినట్టు 'యోగులు' కండి.

అంతేకాదు ఉత్తరగీతలో పూజలు, స్తోత్రాలు, జపాలు కంటే బ్రహ్మను ఆశ్రయించగలిగే ధ్యానం ఎంత గొప్పదో ఈ శ్లోకం ద్వారా వివరించడం జరిగింది.

**శ్లో॥ పూజాకోటి సమం స్తోత్రం, స్తోత్ర కోటి సమం జపం**
**జపకోటి సమం ధ్యానం, ధ్యానకోటి సమోలయః ॥**

తా:- కోటి పూజకు సమానం స్తోత్రమని, అలాంటి కోటి స్తోత్రాలకు సమానం జపమని, అలాంటి కోటి జపాలకు సమానం ధ్యానమని అలాంటి కోటి ధ్యానాలకు సమానం లయమని అర్థం.

దీనిని బట్టి అన్నింటి కంటే పరబ్రహ్మను ఆశ్రయించగలిగే ధ్యానం ఎంత గొప్పదో అర్థం చేసుకోవచ్చు. అటువంటి ధ్యానం ద్వారా మనోలయం పొందవచ్చు. అంటే మోక్షాన్ని పొందవచ్చు. అంటే దుఃఖాన్ని పూర్తిగా అధిగమించవచ్చు.

సహజంగా లోకంలో చెట్లను, పక్షులను, జంతువులను, విగ్రహాలను, గ్రామ దేవతలను, ప్రకృతి దేవతలను ఆరాధిస్తూ వుంటారు. కానీ ఎవరికీ 'పరబ్రహ్మ' గురించి కానీ 'పరబ్రహ్మ' శక్తి గురించి కానీ, 'పరబ్రహ్మ'ను ఆరాధిస్తే వచ్చే లాభాల గురించి కానీ అవగాహన లేదు.



అంతేకాదు 'పరబ్రహ్మ'ను ఆరాధించే అంటే ఆశ్రయించే ధ్యాన మార్గం గురించి కూడా సరైన అవగాహన లేదు.

కానీ భగవద్గీతలోనే కాదు, యోగ వాశిష్టం ద్వారా బ్రహ్మర్షి వశిష్ఠుల వారు కూడా దేవతలను ఆరాధించడం కంటే 'బ్రహ్మాన్ని' ఆరాధించడం వల్ల పొందే గొప్ప లాభాల్ని యోగవాశిష్టంలోని ఈ శ్లోకం ద్వారా చెప్పడం జరిగింది.

**శ్లో॥ తేవాన్దేవయ జో యార్తి యక్షా యక్షాస్స్వజన్తిహి**
**బ్రహ్మ బ్రహ్మయజోయాన్తియదరుచ్చం తథాశ్రయేత్**

తా:- దేవతలను ధ్యానించేవారు దేవతలనే పొందుతారు. యక్షులను ధ్యానించే వారు యక్షులనే పొందుతారు. కానీ బ్రహ్మాన్ని ధ్యానించేవారు బ్రహ్మాన్ని పొందుతారు. కనుక ఏది మహత్తరమైనదో దానినే పొందటానికి ప్రయత్నించాలి.

వశిష్టుల వారి సందేశం కూడా సృష్టిలో అందరికంటే! అన్నింటి కంటే! గొప్పవాడు 'పరబ్రహ్మ' ఆయనే 'ఆత్మ'. ఆయనను ధ్యానిస్తేనే సమస్త జ్ఞానం పొందగలుగుతారు. సమస్త కర్మలు దగ్ధమైపోతాయి. సర్వ దుఃఖాలు తొలగిపోతాయి. అందుచేత భోగాలనిచ్చే దేవతలను ఆరాధించడం కాదు, సమస్త లాభాలు పొందగలిగే 'పరబ్రహ్మాన్ని' ఆరాధించాలి అంటే ధ్యానం చెయ్యాలి. ఇదే వశిష్ఠుల వారి సందేశం.

అంతేకాదు పరబ్రహ్మ ప్రాణులందరికీ మిత్రుడు, యోగులకు ప్రియతముడు, భక్తులకు భగవంతుడు, దేవతలందరికీ దైవత్వ సంపన్నుడు, అందరి హృదయాలకు స్పందన కారకుడు, మనఃస్ఫురణాలకు, బుద్ధి నిర్ణయాలకు ఆధార భూతుడు, స్ఫూర్తిదాత, సర్వ నియంత, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు అయిన ఆ పరబ్రహ్మ ఎల్లప్పుడు నీతోనే వుంటున్నాడు.

దేహస్థితి సన్నగిల్లినా, మిత్రులందరూ వదలి వెళ్ళినా, సంబంధాలన్నీ తెగిపోయినా, నిన్ను విడువని వాడైన ఆ 'పరమాత్ముని', 'భగవంతుని', 'మిత్రుని', 'పరబ్రహ్మ'ను పొందటానికై అనుక్షణం ప్రయత్నించాలి.

అంతేకాదు యజుర్వేదంలో ఈ విధంగా చెప్పబడింది.

**శ్లో॥ "తస్య యోనిం పరిపశ్యంతి ధీరాస్తస్మిన్హ**
**తస్థుర్ భువనాని విశ్వా"**

**(యజుర్వేదం 31-19)**

"విద్వాంసులు ఆ పరబ్రహ్మప్రాప్తికి కారణాలైన


Swami Dayanand Saraswati

సత్యాచరణనూ సత్యవిద్యనూ, ధ్యానంతో తెలుసుకుని పరమేశ్వరుని పొందుతారు ... ఆయన లోనే జ్ఞానులు సత్యనిశ్చయంతో మోక్ష సుఖాన్ని పొంది జనన–మరణ రూపాల రాకపోకల నుంచి విడిపోయి ఆనందంలో మునిగి వుంటారు".

(స్వామి దయానంద – పండిత గోపదేవ్ ఆధారంగా)

అందుచేత ఈ బ్రహ్మజ్ఞానం పొందటానికి మహత్తరమైన సాధన 'ధ్యానం' అని తెలుసుకుని 'ధ్యానం' ద్వారా 'బ్రహ్మ జ్ఞానాన్ని' పొంది జీవితాన్ని ధన్యం చేసుకోండి.



## ధ్యానం చేసే పద్ధతి
## శ్వాసమీద ధ్యాస



ఎవరికి తగిన సుఖాసనంలో వారు హాయిగా కూర్చుని... చేతులు రెండూ కలిపి... కళ్ళు రెండూ మూసుకుని... ప్రకృతి సహజంగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గమనిస్తూ వుండాలి!

మధ్యమధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు 'కట్' చేస్తూ... మళ్ళీ, మళ్ళీ శ్వాస మీదకే... ధ్యాస మరల్చుతూ వుంటే.. క్రమ క్రమంగా... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది.... చిత్తవృత్తులు నిరోధించబడతాయి... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది. మనస్సు శాంతిస్తుంది. ఇదే ధ్యాన స్థితి.

ఈ ఆలోచనా రహిత స్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీ మండల, ఆత్మానుభవాలను గమనిస్తూ వుండాలి. ఆ స్థితిలో విశ్వమయ ప్రాణశక్తి. అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీ మండలాన్ని శుద్ధి చేస్తుంది. ఆ శక్తి వల్ల రోగాలన్నీ తగ్గుతాయి. నాడీమండల శుద్ధి వల్ల కర్మలు పోతాయి.

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో... కనీసం అన్ని నిమిషాలు... తప్పనిసరిగా... రోజుకి రెండు సార్లుగా... ధ్యానం చెయ్యాలి.

# పిరమిడ్ ధ్యానుల తత్వ సారం

జ్ఞాన నవరత్నాలు

ఆత్మే పరబ్రహ్మం

| | |
|---|---|
| జీవుడే దేవుడు | దేహమే దేవాలయం |
| శ్వాసే గురువు | సమయమే సాధన |
| సహనమే ప్రగతి | అనుభవమే జ్ఞానం |
| దానమే ధర్మం | ధర్మమే పుణ్యం |

ధ్యానం.. అంటే.. శ్వాసధార.. మీద..ధ్యాసధార



బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో...
తటవర్తి వీరరాఘవరావు, శ్రీమతి రాజ్యలక్ష్మి దంపతులచే

## ఆత్మజ్ఞాన శిక్షణా శిబిరం

భీమవరంలో ప్రతీ నెలా 1, 2, 3 తేదీలలో పూర్తి రెసిడెన్షియల్ పద్ధతిన ఆత్మజ్ఞాన శిక్షణా శిబిరం నిర్వహించబడుతుంది. ఎన్ని రోజులు ధ్యానం చేసినా ధ్యానంలో పురోగతి సాధించలేనివారు, ఆలోచనలతో ఇబ్బంది పడేవారు ఈ శిబిరంలో పాల్గొంటే ఒకే సిట్టింగులో మూడు లేక నాలుగు గంటలు ధ్యానం చేయగల స్థితికి చేరుకుంటారు. పరిమిత సభ్యులకు మాత్రమే అవకాశం ఉన్నందున ముందుగా మీ పేర్లు నమోదు చేసుకోండి.

ప్రవేశం : ఉచితం

వేదిక : శ్రీ వెంకటేశ్వరస్వామి వారి ఆలయం, నరసింహపురం, ఉండి రోడ్, భీమవరం.

వివరాలకు : **తటవర్తి వీరరాఘవరావు,**
తటవర్తి వారి వీధి, భీమవరం - **534 201.**
సెల్ : 94403 09812, 94901 71853

# తటవర్తి వీరరాఘవరావు గారి రచనలు

| | |
|---|---|
| 1) జీవితశాస్త్రం (మొదటి భాగం)- | రూ.100/- |
| 2) జీవితశాస్త్రం (రెండవ భాగం)- | రూ.100/- |
| 3) జీవిత సత్యాలు - | రూ.100/- |
| 4) భగవంతుడంటే - | రూ.100/- |
| 5) సత్యమార్గం - | రూ.100/- |
| 6) ఆత్మ శాస్త్రం - | రూ.100/- |
| 7) ధ్యాన శాస్త్రం - | రూ.100/- |
| 8) జ్ఞానరసగుళికలు (పత్రీజీ) - | రూ.100/- |
| 9) పరమగురువుల ప్రబోధాలు (పత్రీజీ) - | రూ.100/- |
| 10) భగవద్గీతా సారం - శ్రీ కృష్ణ సందేశం - | రూ.100/- |
| 11) ధ్యాన శక్తి - | రూ.100/- |
| 12) తెలుసుకోండి - | రూ.120/- |
| 13) జీవిత సూక్ష్మాలు - | రూ.120/- |
| 14) గీతాసందేశం - | రూ.100/- |
| 15) కర్మ సిద్ధాంతం - | రూ.60/- |
| 16) బ్రహ్మాజ్ఞానం - | రూ.60/- |
| 17) ఆత్మజ్ఞానం ఎందుకు? - | రూ.70/- |
| 18) ధ్యానమంటే ? - | రూ.50/- |
| 19) జ్ఞాన జ్యోతి - | రూ.70/- |
| 20) జ్ఞాన కుసుమాలు - | రూ.50/- |
| 21) దుఃఖ నివారణామార్గం- | రూ.60/- |
| 22) త్రివిధాలు - | రూ.60/- |
| 23) ధ్యానం (పత్రీజీ) - | రూ.50/- |
| 24) ధ్యానం వల్లనే జ్ఞానం - | రూ.60/- |
| 25) అతీంద్రియ శక్తులు - | రూ.50/- |
| 26) శాస్త్రాల అర్థం- అంతరార్థం - | రూ.50/- |
| 27) ఆశ్చర్యం... ఆశ్చర్యం - | రూ.50/- |
| 28) విద్యార్థుల వికాసానికి ధ్యాన విద్య - | రూ.50/- |
| 29) మౌన ధ్యానం - | రూ.40/- |
| 30) ఈ జీవితం ఎందుకు? - | రూ.50/- |
| 31) నిర్వాణ మార్గం - | రూ.50/- |
| 32)షిరిడీసాయి సందేశాలు - | రూ.40/- |
| 33) భాగవత సన్నివేశాల అంతరార్థం - | రూ.40/- |
| 34) భూతదయే దైవత్వం - | రూ.40/- |
| 35) ఆలోచించండి - | రూ.40/- |
| 36) సంకల్పమంటే? - | రూ.50/- |
| 37) మరోజన్మ (తటవర్తి రాజ్యలక్ష్మి) - | రూ.30/- |
| 38)మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? - | రూ.20/- |
| 39) శాకాహారమే మానవాహారం - | రూ.15/- |
| 40) అహింస మరియు శాఖాహారం - | రూ.15/- |

పుస్తకముల కొరకు :

**తటవర్తి వీర రాఘవరావు,**

తటవర్తివారి వీధి, భీమవరం-1. ప॥గో॥జిల్లా.

సెల్ : 9440309812, 9490171853



**"రుచం బ్రహ్మం జనయంతో దేహా అగ్రే తదబ్రువన్,**
**యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్తస్య దేవా అసన్ వశే"**

(యజుర్వేదం 31-21)

"బ్రహ్మజ్ఞానం ఆనందదాయకం
అది మనుష్యులకు బ్రహ్మంలో రుచిని పెంచుతుంది
ఆ బ్రహ్మ జ్ఞానాన్నీ, దాని సాధనాలనూ
విద్వాంసులు ఇతర మానవులకు ఉపదేశించి
వారినీ ఆనందింప చేస్తారు
ఏ మనుష్యుడు ఈ విధంగా బ్రహ్మంను తెలుసుకుంటాడో
అలాంటి విద్వాంసుడికి మనస్సు మొదలయిన ఇంద్రియాలన్నీ
వశంలో ఉంటాయి... ఇతరులకు వుండవు".

(స్వామి దయానంద - పండిత గోపదేవ్ ఆధారంగా)

పత్రీజీ తులసీదళం నుండి...

రూ. 60/-లు